శ్రీ నిరంజనస్వామి గ్రంథమాల ప్రథమ పుష్పము

# బసవేశ్వరుని తత్త్వములు



ప్రకాశకులు :



దు వీరశైవ సమాజము

శ్రీ నిరంజనస్వామి పంచుకమేటి మఠము

లాలాగుడ బజారు సికింద్రాబాదు (ఆం. ప్ర.)

శ్రీ నిరంజనస్వామి గ్రంథమాల ప్రథమ పుష్పము

# బసవేశ్వరుని తత్త్వములు


సంపాదకులు:

పండిత రాచ వీరదేవరు పెద్దమఠము

'సంస్కృత కావ్యతీర్థ' (ఆం.సా.ప), 'విశారద'

'హిందీ విశారద', 'కన్నడ నుడిజాణ', జోగిపేట.



వికారి సం॥ వైశాఖ శు॥ ౩

(బసవ జయంతి) 1959

మూల్యము

రు. 0.50



శ్రీ కల్యాణ బసవేశ్వరుడు.

“నాకన్నపిన్నలు లేరు, శివభక్తుల కన్నపెద్దలు లేరు. నీపాదసాక్షి, నా మనస్సాక్షి. కూడల సంగమదేవా నాకిదియె దివ్యము.”

# మనవి

వీరశైవ సజ్జనులారా! నేడు "బసవజయంతి" పుణ్యదినమున, శ్రీ నిరంజనస్వామి గ్రంథమాల, ప్రథమ పుష్పముగా వెలువడు చున్న నీ "బసవతత్త్వము" లను పుస్తక మింత త్వరలో వెలువడునని విశ్వసించియుండలేదు. ఐనను, "కర్మణ్యేవాధికారేస్తు మాఫలేషు కదాచన" యను నీతి వాక్యము ననుసరించి, నా మిత్రులు కొందరు బసవని గూర్చిన వ్యాసములను, సకాలమునకు పంపిరి. అంతలో విమర్శ కాగ్రేసరులు, ఐతిహాసిక సామ్రాట్టులు, ధర్మభూషణులగు శివశరణ శ్రీ పండిత బండారు తమ్మయ్యగారి వ్యాసము "బసవేశ్వరుని శీలము; జీవితతత్త్వము." అను శీర్షికతో "స్వధర్మ"యందు జూచితిని. ఆ వ్యాస మునుకూడా నీ సంగ్రహమునందు చేర్చిన మరింత శోభ గలుగునను నుద్దేశ్యముతో దానినీ సంపుటమునందు చేర్చితిని.

శికింద్రాబాదు వీరశైవ సమాజము అధ్యక్షులు, ధర్మాభిమానులగు శ్రీ మాదపు బొంతప్పగారు, శికింద్రాబాద యందలి "నిరంజనయ్య మఠము" పూర్వపు స్వాముల స్మారకార్థము, శ్రీ నిరంజనస్వామి గ్రంథమాల ప్రథమ పుష్పముగా ఈ సంపుటమును ప్రకటించు నవ కాశమొసగి ఈ కార్యమును సఫల మొనరించినందులకు, శికింద్రాబాదు వీరశైవ సోదరుల ధర్మాభిమానమును శ్రీ మాదపు బొంతప్పగారి యుదార బుద్ధినెంత యుగ్గడించినను తక్కువే!

ఇంతకుపూర్వము శోలాపురమునందు, ధర్మనిష్ఠాపరులు శరణ సాంప్రదాయులగు లింగైక్యులు శ్రీ వారద మల్లప్పా అప్పా సాహెబు గారు మన వీరశైవ ధార్మిక గ్రంథములు చాలినన్ని లేని కొరతను

దీర్చుటకు, పుష్కలముగా ధనమును వెచ్చించి, అనేక పండితులచే ననేక ఉత్కృష్టమగు మతగ్రంథములను వ్రాయించి, ప్రకటించి, మన వీరశైవ ధర్మప్రచారమునందు తోడ్పడినవారై యశఃకాయులైరి. నేడు అట్టి పుణ్యమూర్తి యాకృతియే మన మాడపు బొంతప్పగా రన వచ్చును.

శ్రీ బొంతప్పగారు వయస్సునందు చిన్నవారైనను, సమాజ కార్యములయందు, ధర్మప్రవృత్తియందు పట్టుదలగలవారు. శికింద్రాబాదు యందలి "నిరంజనస్వామి మఠము" అభివృద్ధికిని, అచ్చటి వీరశైవ సమాజ కార్యకలాపముల అధిక్యతకును, వారి ధర్మాభిమానము, కార్య దక్షతలే కారణము. ఇట్టి పట్టుదలగల ధర్మాభిమానులు, తమ సమాజమునకు అధ్యక్షులుగానుండు సుయోగము లభించినందుకు, శికింద్రాబాద వీరశైవ సోదరులు ధన్యులు,వారికి నా హృదయపూర్వక అభినందనములు. వారి ఈ ధన్యతనే, నేడు, ఈ పుస్తకమును మన తెనుగు నుడి తల్లికి, క్రొత్త సొమ్ముగా, అత్యంత సంబరముతో సమర్పించు నవకాశమును గలిగించినది. అందుకు వారికి నా కృతజ్ఞతలు. పరమేశ్వరుడు వారి ఉత్సాహము, ధర్మాభిమానములను ద్విగుణీకరించి వారి యాజమాన్యమునందు సమాజము ప్రగతిజెందు నవకాశమును ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాడను.

పుస్తకములు ప్రకటింపబడినంతనే "గ్రంథమాల" ఉద్దేశ్యములు పూర్తిగా వనునది నిస్సందేహము. పాఠక లోకము పుస్తకములను చదివి అందలి తత్త్వముల ననుభవము చేసికొనిననే, మా ప్రయత్నములు సఫలమగును. గావున పాఠకలోకము ముఖ్యముగా ఆంధ్ర వీరశైవ సోదరులు, ఈ గ్రంథమాల పుస్తకములను, తప్పక తెప్పించు

కొని చదివి అందలి తత్త్వముల ననుభవము జేసుకొని, వాని నాచరణ యందు తెచ్చి మమ్ము ప్రోత్సహింతురని నమ్ముచున్నాను.

ఇటులనే, మన ప్రాంతమునందలి ధనికసోదరులు, శ్రీ మాడప్ప బొంతప్పగారి ఉదారబుద్ధి ననుకరణించి, "మాకూడల సంగని శరణులకు జెందని అర్థము వ్యర్థము చూడయ్యా!" యను బసవని వచన మును మనసున నమ్మి, సమాజాభివృద్ధి కార్యములయందు ప్రవృత్తులై తమతమ ప్రాంతములయందు, సమాజములను స్థాపన మొనరించి, వానిమూలముగా, మన వీరశైవులయందు ప్రస్తుత మావరించియున్న వైజ్ఞానిక, ధార్మిక, సామాజిక, శైక్షణిక, ఆర్థిక అవనతిని దొలగించి, మన సమాజము సర్వాంగ సుందరముగా ప్రగతి నొందునట్లు ప్రయత్నింతురని విశ్వసించుచున్నాను.

"శ్రీ నిరంజనస్వామి గ్రంథమాలకు సంపాదకులుగానుండి ధార్మిక, సారస్వతసేవ జేయుట కవకాశము నొసగినందులకు శికింద్రాబాదు వీరశైవ సమాజమువారికి, మరియు బసవని విషయమునందు మహత్తరమగు విషయములతోగూడిన వ్యాసములను శ్రద్ధతో వ్రాసి పంపిన మిత్రులందరికిని, తమ వ్యాసము నిందు చేర్చుట కనుజ్ఞ నొసగిన పండిత ప్రకాండులగు శివశ్రీ బండారు తమ్మయ్యగారికిని నా హృదయపూర్వక కృతజ్ఞతల తెలుపుచు, "బసవని తత్త్వము" లను ఈ పుస్తకమును, ఆ మహాత్ముని జన్మదినమగు నేడు శ్రీనిరంజనస్వామి గ్రంథమాలయందు ప్రథమ పుష్పముగా శికింద్రాబాదు వీరశైవ సమాజమువారిచే ప్రకాశింపబడినదని ప్రకటించుచున్నాను.

శివం భూయాత్.

శికింద్రాబాదు.
10-5-1959.

సంపాదకుడు.

# అనుక్రమణిక

—★—

# బసవేశ్వరుని శీలము-
# జీవిత తత్త్వము



ఉ. శ్రీ గురులింగతత్త్వరుడ శేషజగన్నిధి శుద్ధతత్త్వ సం
యోగసుఖప్రపూర్తి వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తిది
వ్యాగమమార్గవర్తి బసవయ్యకృపాంబుధి మీకు దివ్య సం
భోగములన్ ప్రసాదసుఖభోగములం గరుణించుగావుతన్.

శ్లో॥ యస్సంగీతనిధిర్యమాహుఃరభవం యేనార్చితంసూనృతం
యస్మైత్మస్వస్తియత స్తదీయముదభూద్యద్వీర శైవప్రితమ్
యస్యాపాంగసహోదరీచ కరుణాయస్మిన్మహత్వాదయః
సత్వంత్రిణిజగంతి పాహిబసవా మాత్యేశ చూడామణే!

మహాజనులారా! వీరశైవ సోదరులారా!!

వీరపూజ, వీరారాధనము భారతీయులలోనే గాక సమస్త ప్రపంచమునందును చిరకాలమునుండి పరిపాటిగా జరుగుచున్నది. వీరుడనగా నవ్యక్రపరాక్రమము నెఱపి శత్రుసంహారమొనర్చు శూరుడనుభావము సర్వసాధారణముగా వ్యవహారమునందున్నది. ఇట్టి యర్థముననే రామాయణ వీరుడు శ్రీరాముడనియు, భారతవీరుడు పార్థుడు (అర్జునుడు) అనియు గీర్తింపబడుచున్నారు. ఇట్లే ముప్పదిమూడుకోట్ల దేవతల మోదిమోది దక్షయజ్ఞ ధ్వంసమొనర్చిన రుద్రావతారుడగు వీరభద్రునకు వీరశబ్దము పర్యాయముగ నేర్పడినది. కాని కేవలశౌర్యమే వీరధర్మముగా మన

దేశముననేమి తదితరదేశములందేమి విజ్ఞానులగు పెద్దలు పరిగణించి యుండలేదు. వీర శబ్దమున కించుమించుగ సమానార్థకముగ Hero అను పదము ఆంగ్లభాషలో వ్యవహృతమగుచున్నది. సుప్రసిద్ధ విద్వాంసుడు (Thomas Carlyle) తాను రచించిన (Hero Worship) (వీరారాధనము) అను గ్రంథములో Hero as a Poet, Hero as a Prophet, Hero as a Philosopher ఇత్యాదిగా వీరవర్గమును బలువిధములుగ విభజించియున్నాడు. గీర్వాణవాఙ్మయమును మథించి యలంకార శాస్త్రమును రచించిన మన యాలంకారికులుగూడ నా యా కావ్యనాటకములందలి నాయకులను దయావీరుడు, దానవీరుడు, ధర్మవీరుడు మున్నగు విధములుగా వారి వారి ప్రధానోత్తమ గుణముల ననుసరించి నిర్వచించి యుల్లేఖించియున్నారు. కావున నొక ఖడ్గబలముచే శత్రువుల నిర్జించి దేశసౌభాగ్యమును గూర్చినవారేగాక తమ కలము బలిమి (కవితాశక్తి) బుద్ధిబలము (తత్త్వజ్ఞానము). మత ప్రచారము (ప్రవక్తృత్వము) దయాదానధర్మాది సద్గుణగరిష్ఠత్వముల మూలమున సంఘము దేశము నుద్ధరించి దేశకల్యాణమునకు సాధకులయిన మహాపురుషు లందఱుకూడ వీరశబ్దవాచ్యులయి తరువాతి తరముల వారికి పూజనీయులగుచున్నారు. వీరశైవవాఙ్మయమున "విశబ్దే నోచ్యతేవిద్యా శివజీవైక్యబోధినీ తస్యాం రమతయశ్శైవః వీరఇత్యభిధీయతే" అని శివజీవైక్య, విద్యాసాధకుడు వీరుడనిచెప్పబడియున్నది. కావున వీరశైవులెల్లరకు గూడ నామైకదేశమున వీరశబ్దము వ్యవహృతమగుచున్నది. పూర్వోదాహృతములయిన యుత్తమగుణములెన్నియో పుంజీభవించి యేకాశ్రియమొంది యవతరించిన మహాపురుషుడు క్రీ. శ. 12వ శతాబ్ది యందు కర్ణాటదేశమున హింగుళేశ్వర బాగవాడియందు జననమొంది పశ్చిమచాళుక్యాధీశుడగు బిజ్జలుని ప్రధానమంత్రియై, కూడలి సంగమేశ్వర చరణారవిందవిలగ్న మిళిందాయమాన మానసుండై, జంగమ

ప్యసిన మహిమ్ఘుండై, వీరశైవ మతోద్ధరణ మొనర్చి విశ్వజ్యోతియై వెలింగి చిరస్మరణీయుడైన కల్యాణ బసవేశ్వరుడు. అట్టి లోకోత్తర వీరుని యారాధన రూపకముగ వీరశైవలోక మేటేట యాతని జయంతిని జరుపుట విధ్యుక్తధర్మమని వేఱుగజెప్పనక్కఱలేదు. ఈ ధర్మ నిర్వహణములో వ్యగ్రోత్సాహముల బ్రకటించు వీరశైవసంఘముల భాగధేయము ప్రశంసనీయము.

జగజ్జేగీయమానములయి, వీరశైవలోకమునకునిత్యపారాయణము లైన బసవేశ్వరుని గుణగణముల వివరించుటకు నేను సర్వథా యసమర్థుడను. ఆ మహనీయుని చరితమును రచించి హరీశ్వరుడు, పాలకురికి సోమనాథుడు, భీమకవి, సింగరాజు మున్నగు కర్ణాటాంధ్రకవులు తమవాణిని పునీతమొనర్చి కృతి నాయకునితోపాటు తాముగూడ శాశ్వత యశశ్శరీరులై విరాజిల్లుచున్నారు. అందునను పాలకురికి సోమనాథుడాంధ్రుడయ్యు బసవేశ్వరు నెడ ప్రకటించిన భక్తి పారవశ్య మనన్యసామాన్యము. భీమకవి కన్నడ బసవపురాణమునకు సోమనాథుని తెలుగు బసవపురాణమే మాతృకయని వేఱుగ జెప్పనక్కఱలేదు. బసవని చరితమును సోమనాథుడు బసవపురాణమను పేరితో పురాణరూపకముగ రచించుటయేగాక వృషాధిప శతకము, చతుర్వేదసారము, బసవోదాహరణ యుగ్మము, పంచప్రకారగద్య, నమస్కారగద్య, అష్టోత్తర శత నామగద్య, అక్షరాంక గద్యపద్యములు, బసవరగడ, బసవాష్టకములు, పంచ రత్నములు, మున్నగు నెన్నియో లఘుకృతుల రూపమునగూడ వెల్లడించియున్నాడు. "బసవన్న మహిమ శుంభద్భక్తియుక్తి బసరించితివి గద్యపద్యాది కృతుల నర్ణవావృత ధాత్రియందొప్ప బసవ వర్ణనల్ చేసితి"వని భక్తులగ్గడించినట్లు లాతడు పండితారాధ్య చరిత్రావతారికలో వ్రాసికొన్నాడు. బసవేశ్వరుడు నాల్గులక్షల యఱువది నాల్గువేల గీతములు రచించినట్లు సోమనాథుడు తన బసవపురాణమున నుదహరించినాడు.

బసవేశ్వర వచనములని కర్ణాట వాఙ్మయమున బ్రశస్తిగాంచిన యీగీత ములలో శ్రీ హలకట్టి, బసవనాళ్ మున్నగు పరిశోధకుల విశేషపరిశ్రమ పూర్వకముగ నిప్పటికే తొమ్మిదిదివందలో లభ్యమగుట దుస్తరమయినది. వేదవేదాంత సారములయి అసంఖ్యాకములగు బసవేశ్వరు గీతము లనేక ములు కాలగర్భమున నడగిపోవుట లోకముయొక్క దురదృష్టము. ఇట్టి గతియే సోమనాథుని బసవస్తవములకును ఘటిల్లినది. లెక్కకుమిక్కిలిగ నాతడు రచించిన లఘుకృతులలో మనకు దొరికినవి బహుస్వల్పములు మాత్రమే. బసవజయంతిని జరుపుటలో శ్రద్ధానుభూతిని జూపు సంస్థలు, సంఘములు, వినష్టములయిన బసవగీతములను సోమనాథుని కృతులను గూడ వెలికిదీసి ప్రకటించుటకయి తగిన కృషిగావించి చరితార్థత నొందుదురుగాక యని ప్రార్థించుచున్నాను. బసవేశ్వరుని తత్త్వము. చరిత్రము గ్రహించుట కితరులు వ్రాసినకృతుల కన్న నాతడు స్వయ ముగ గేయరూపకములుగ రచించిన వచనములే యెక్కువ ప్రామాణ్య మును వహింపగలవనుట నిర్వివాదము. రానురాను ప్రక్షిప్తములుగూడ గొన్నిచేరి యాపేరితో వ్యాప్తిలోనికివచ్చినను. శైలి. భాష. లాలిత్యము మాధుర్యము మున్నగు విశేషములబట్టి కర్ణాట విద్వాంసులు వానిని వేఱు వఱుప గల్గుదురనియే నావిశ్వాసము.

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అనునట్లు ధర్మ మునకు గ్లాని కలిగినప్పుడు భగవంతుడే దాని నుద్ధరించుటకయి యవత రించునని భారతీయుల విశ్వాసము. దక్షిణ హిందూస్థానమున బసవేశ్వ రుని కాలమునకు ముందిట్టి ధర్మగ్లాని గలిగి, బౌద్ధ, జైన, చార్వాకాది నాస్తికధర్మములు, ఆచరణశూన్యమగు సర్వాద్వైత ధర్మము ప్రబలి ప్రజలలో భక్తినశించి గుణములచేగాక జన్మము (కులము) చేతనే మానవుని యాధిక్యము గణ్యమై, యగ్రజన్ముల యొత్తిడి కోర్వజాలక సామాన్య మానవలోకము దారిగానక తహతహ లాడుచున్నప్పుడు ధర్మ

స్థాపనము, వీరమతోద్ధరణము నొనర్చ పరమేశ్వరుడే తనకు వాహనము నభిన్నుడునగు నందీశ్వరు (ద్వితీయ శంభుని) బసవేశ్వరునిగా నవత రింపజేసెనని సోమనాథుని బసవపురాణమువలన దెలియుచున్నది. హరీ శ్వరుడు వృషభముఖుడను ప్రమథుడు కొండొక శాపవశమున బసవ డయి జన్మించెనని తన బసవరాజదేవ రగళెలో వ్రాసి యున్నాడు. ఏది యైనను నిందలి ఫలితార్థ మించుమించుగ నొక్కటియే. సర్వమానవ సౌభ్రాత్రము బసవేశ్వరుని జీవితమునకు ప్రధాన సూత్రము. అందుచే స్త్రీ పురుష విభేదము, జాతి విభేదము లేక యందఱుగూడ నాత్మజ్ఞానము గలిగి శివజీవైక్యసిద్ధిని బడసి తరించుట కర్హులనెడి వీరశైవ మత ధర్మము నుద్ధరించి క్రియారూపకముగ ననతికాలములో నీమతమును కర్ణాట దేశమున విస్తరింపజేసిన మహావ్యక్తి బసవేశ్వరుడు. "దీయతే లింగసంబంధః క్షీయతేచ మలత్రయమ్ దీయతే క్షీయతే యస్మాత్ తస్మాత్ దీక్షేతి కథ్యతే" అను శివాగమ ప్రమాణముచే వీరశైవదీక్ష నొందినంతనే సాధకుని యాణవిక, కార్మిక, మాయామలములు నశించి భౌతికశరీరము లింగశరీరముగ మాఱి యాతని తొంటి కులములు, మల ములు దగ్ధములయినట్లే గణింపదగునని, కావున వీరశైవదీక్షితులందఱు సోదరప్రాయులేయని, వారి పూర్వజాతిని స్థితిని స్మరించుట పాతక హేతువని శివాగముల వలననే తెలియుచున్నది. కాని సనాతనమైన యీ ధర్మము నామమాత్రమై యాచరణ శూన్యమగుటచే పంచాచార్య స్థాపిత మయిన వీరశైవము గుంటపూవులు పూయుచు బసవేశ్వరుని కాలము నాటికి చాల క్షీణదశయందుండుటచే "సంఘేశక్తిః కలౌయుగే" అను సూక్తిని జింతించి సనాతన ధర్మము నుద్ధరించి వీరశైవ దీక్షాస్వీకారార్హత విషయమున దేశమున వేళ్లువాఱియున్న వర్ణాశ్రమ వ్యవస్థ ననుసరించి పాటింపబడుచుండిన కాలవ్యవధి సంబంధిక నిర్బంధముల సడలించి, తొంటి కులములు నాచారము లెట్లున్నను దీక్షయైన వెంటనే వీరశైవ

విశిష్టములైన అష్టావరణ పంచాచారము లవలంభించినంతనే భ్రమరకీట న్యాయమున నంత్యజులుకూడ కులజులుగానే పరిగణింపబడి పూజింప దగుదురని బోధించి తన్మూలమున పతితజనోద్ధరణమునుగూడ సాధించి వీరశైవమతమును జీవకళాచైతన్యములతో బసవేశ్వరుడు సత్వరముగ విస్తరింపజేసెననియు, ఇదియే పంచాచార్యుల వ్యవస్థ కొతడు గావించిన ప్రధాన సంస్కరణమనియు, నేను తలంచుచున్నాను; ఆనాడు పంచాచార్యులతో బసవేశ్వరున కీవిషయమున ప్రతిఘటన ముండినట్టు లాధారములేవియులేవు. ప్రతిఘటన మేదయిన నున్ననది స్మార్తబ్రాహ్మణులతోనే యని బసవ పురాణమునుబట్టి ద్యోతకమగును. ఇట్టి విశాలహృదయుడగు సంస్కర్త యవతరించుటవలననే దక్షిణ హిందూస్థానమున వీరశైవము నేటికిని విస్తరించియుండ గల్గినది. అట్టివాడుత్తర హిందూస్థానమున నవతరింపక పోవుటవలననే పంచాచార్య సింహాసనములు రెండు కాశీ కేదారములయందు నిలిచియున్నను వీరశైవసంఘ మచ్చట నామమాత్రావశిష్టముగ నుండుట యేర్పడినది. దీనినిబట్టియే నేటి వీరశైవసంఘము బసవేశ్వరుని ఘనకార్యముల కెట్లు ఋణపడియున్నదో గ్రహింపదగును. బసవేశ్వరుడు గావించిన యీసంస్కరణము నుద్దేశించియే వేమన శివయోగి "ఉర్వివారి కెల్ల నొక్కకంచముపెట్టి పొత్తు గుడిపి కులము బొలియజేసి తలనుజేయిపెట్టి తగనమ్మ జెప్పరా విశ్వదాభిరామ వినురవేమ..." అని గానమొనరించినాడని నాయభిప్రాయము. బసవేశ్వరుడు గావించిన పతితజనోద్ధరణ మాపతితజనుల అంతరంగ బహిశ్శుద్ధులకు దానకమయి శాశ్వతఫలదాయక మయినది. నేటి సంస్కర్తల హరిజనోద్ధరణ మట్టిదికాదు అగ్రజాతుల మనుకొనువారు, హరిజనులతో జేతులు కలిపికొని తిరుగుటవలనను, వారికి దేవాలయములలో ప్రవేశమొసంగినంత మాత్రముననను వారికి వాస్తవముగ నొరికిన దేమియు లేదు. కావున వీరశైవ దీక్షామూలకముగ బసవడు

గావించిన పతిత జనోద్ధరణమునకు నేటివారి హరిజనోద్ధరణమునకు హస్తిమశకాంతర మున్నది. త్రికరణశుద్ధి లింగ జంగమముల యెడ నభేదభావముతో తను మనోధన సమర్పణము. అనన్య శరణ్యబుద్ధితో పరమేశ్వరుడగు కూడలి సంగమేశ్వరునందలి విశ్వాసము. అన్యదేవతా స్మరణ భజనరహితమగు నేకేశ్వరోపాసనము, పరసతీ పరధనపరాఙ్ముఖత్వము, ననునవి బసవేశ్వరుని శీలమునకు సహజాలంకారములు. ఇందుగూర్చిన హెచ్చరిక లాతని వచనములలో బహుముఖముల బ్రస్ఫుటమగుచుండును. దయాసత్యశౌచములు లేని మానవుని జీవితము నిరర్థకము; పురుషార్థములలో బ్రిప్రిథమమగు ధర్మమునకు దయయే మూలమని బసవేశ్వరుని యుద్ఘోషము. 'దయ యిల్లద ధర్మ వదావుదయ్యా' దయలేని ధర్మ మెట్టిదని యాతడు లోకమును ధట్టించి ప్రశ్నించెను. అతని ధార్మికజీవనమున కాతని కరుణార్ద్రిహృదయమే మూలస్తంభము. బసవని ఈ యుత్తమ గుణ విశేషము నెక్కుడుగా గణించి సోమనాథుడు 'నీవు దయాప యోనిధివి' 'బసవయ్య కృపాంబుధి' 'యస్యాపాంగ సహోదరీచ కరుణా' ఇత్యాది వర్ణనముల జాలచేసినాడు. కరుణారస మనుగ్రహించువానిని పరిగ్రహించు వానిని నిరువురను పవిత్ర మొనర్చునని షేక్స్పియరు మహాకవిగూడ వర్ణించినాడు. ఇక దానవిషయములో నన్ని దానములలో నన్నదానమిన్నయని 'నాన్నోదక సమందానమ్' ఇత్యాది సూక్తులలో మనపెద్దలు ఘోషించియున్నారు. జీవికి దీనివలన గలుగుతృప్తిమఱి దేనివలన గలుగనేరదనుట సర్వానుభవసిద్ధము. జంగమశబ్దము వీరశైవ వాఙ్మయమునకులవాచకముగకాక చరలింగ (జీవిరూపమున చరించు శివుడు) ద్యోతకముగనే యుదాహృతమయిన సంగతి విజ్ఞులెల్లరకు విదితమే. కావున నది శివభక్తు లందఱకు గూడ జెల్లునదియే. 'చరతీతిచరః' 'జంభృశంగచ్ఛతీతి జంగమః' అను వ్యుత్పత్త్యర్థములు గూడ దీనినే నిరూపించును. లింగమునకు జంగమమే

వచనమని చెప్పి జంగమసేవ వలననే లింగానందము కలుగుననెడి దృఢ విశ్వాసములతో తను మనోధనముల నెల్ల నందుకయి వినియోగించిన భక్తి భాండారి బసవడు. నిత్యము నాతడు లక్ష తొంబది యాఱువేల జంగములకు గణార్చన మొనర్చెడివాడను వాడుక తరతరంబుల నుండి వినవచ్చుచున్నది. ఇట్లని సోమరిపోతులెల్ల బసవని యింటజేరి యాతని కందాలో విందు లారగించెడివారని లోకము భ్రమింపరాదు. బసవడా నర్చెడి జంగమదాసోహ వ్రతములో నర్థి దాత యను తారతమ్యమే లేదు. ఆనాటి శరణులు గూడ తృణీకృత హరిబ్రహ్మ పురందరులు. అలలేని శివభక్తి యరచేతి చింతామణిగ్రామై యుండ బసవని వలెనే వారు గూడ తమ యీప్సితార్థముల దామే పడయగల వలతులేగాని బడుగులు కారు. "కాయకమే కైలాస"మని గుర్తించియేదోయొక కాయక మవ లంబించి జీవితము నెఱపినవారేగాని సోమరు లానాటి భక్తులలో లేనేలేరు. కట్టెల మారయ్య, కలకేత బ్రహ్మయ్య. మడివాలు మాచయ్య మున్నగు భక్తుల చరిత్రముల దిలకించిన యందలి తత్త్వము తెలియనగును. కావున బసవని భక్తిగౌరవముల కలరియే యానాటి భక్తలోకమాతని సపర్యల స్వీకరించెడిదని మనము గ్రహింపదగును.

'నాకన్న పిన్నలు లేరు. శివభక్తులకన్న పెద్దలు లేరు. నీపాద సాక్షి, నా మనస్సాక్షి. కూడల సంగమ దేవా! నాకిదియే శ్రేష్ఠము' అను నర్థముగల "ఎనగింతకిరియ రిల్ల శివభక్తరగింతహిరియ రిల్ల——" అను గీతమె బసవని యహంకార శూన్యతకు ప్రబలాదర్శము. మఱియు భక్తులెల్ల సాక్షాత్తు కూడలి సంగమేశ్వరుని మాఱట మూర్తులే యని యాతని నిర్మలభావము. ఇందుకొక చిన్నదృష్టాంత ముదాహరింతును. బసవన్న యనుయాయులలో మడివాలు మాచయ్య పేరెన్నిక గన్నవాడు. త్రికరణశుద్ధిలో నాతడు బసవని శుద్ధియైనవాడు. నిష్కాపట్యముగల నిష్ఠురవాది. బసవని భక్తి స్వర్ణ భాండారమున కాతడు నికషోపలము.

(గీటుకాయి) వంటివాడు. ఒక నా డొకభక్తుడు బసవని గీతమునొకటి మాచయ్య యెదుట పాడి వినిపించెను. అందెందుచేతనో మాచయ్య దృష్టి కించుక యహంకృతిచ్ఛాయ గోచరించెనట. అందుకెంతయు కినిసి బసవడెంత యవివేకి యయ్యెనని యాజంగమము నెదుట మాచయ్య యేమేమియో యుపన్యసించెను. అనంతరి మీసంగతి నా జంగమము తెలుపగా బసవ డొక్క పరువున మాచయ్యకడకేగి యాతని పాదములకెరగి 'ఆక్రాంత సంతతాహంకార నిరతు, సక్రమూలాపు నిర్వ్రాప రాధు, నూర్జితక్రోధువివర్జితసత్యు, దుర్జనాకారు ననిర్జితకాము, నజ్ఞాన పుంజమ్ము నపగత శౌచు విజ్ఞాన హీను, వివేక విదూరు, నిర్భాగ్యచూడా మణిని, భక్తి రహితు, దుర్భావకు నవినీతుని నన్ను నింత గాచి రక్షింపవే కారుణ్యపాత్రః యేచినమద్గర్వ మెల్ల మాయించి' ఇత్యాదిగా నాత్మనింద కావించుకొని, లాలితంబుగ నాల్గులక్షలమీద, నోలి నర్వదినాల్గు వేల గీతముల, గావించుటిది యెల్లగని యేపగించు భావన నాకయ్యె నీవు గైకొనమి నాయతప్రీతి నోయనకున్న నింక ఛాయన నయ్యయో సంగయ్యదేవ!' అని మాచయ్య క్షమార్పణమును వేడికొనెను. గంభీర విగ్రహుడయి నెత్తివాచునట్లు నిష్ఠురోక్తుల నెట్టయెదుట తనతో నాడు చున్నది మాచయ్యయైనను, అట్లు పలుకునది నిజగురుడగు సంగమేశ్వ రుడే యను బసవని భావము గమనింపదగినది. "తందెనీను, తాయినీను, బంధునీను, బళగనీను, నీనల్లద, మత్తారూ, ఇల్లవయ్య కూడల సంగమ దేవా హాలల్లద్దు, నీరల్లద్దు. (తండ్రివి నీవు, తల్లివి నీవు, బంధువు నీవు, బలగము నీవు, నీవుగాక ఇంకెవ్వరూ లేరయ్యా, కూడల సంగమదేవా, పాలముంచుము, నీటముంచుము). సంగమేశ్వరుడే సకలమ్మని నెమ్మన మ్మున ముమ్మరమ్ముగ నమ్మిన మహాభక్తునకే యిది చెల్లును గదా!

బసవేశ్వరుడు ప్రజ్ఞాచక్షువనియు, మహారాజ సచివుడవుటచేత చారచక్షువనియు లోకమున తెలుకవడిన విషయము. "పలు సందియముల

దొలచును. పెలయించు నగోచరార్థ విజ్ఞానములో. కులకక్షి శాస్త్రమది. యలవశ మెవ్వనికి వాడె యంధుడు జగతిన్" అను సూక్తికనుగుణముగ శాస్త్రజ్ఞుడగుటచే జ్ఞానచక్షుష్మంతుడనియు తెలియనగును. ఇట్లన్ని విధముల చక్షుష్మంతుడైన బసవనికి సోమనాధుడు విలక్షణముగ నొక తీరు జను షాంధత్వమును (పుట్టు గ్రుడ్డితనమును) గల్పించినాడనిన నది మిక్కిలి విపరీతముగ గోచరింపకపోదు. అదెట్టిదియో తిలకింపుడు, "పరవనితా జన భాసురతర ముఖమండల వీక్షణవిధి జాత్యంధాత్" పయిని జెప్పిన విరోధము కవి వర్ణనములో ప్రతిపాదితమయిన విషయమును బట్టి విరోదాభాసాలంకారరూపముగ నివారితమైనది. పరవనితా ముఖ విలోకన విధియందు బసవేశ్వరుడు జాత్యంధుడని దీని యర్థము. మహాకవుల వర్ణనము లిట్లేయుండును. బసవేశ్వరుని పరవనితా విముఖత్వమును సామాన్యకవులింత దృఢతరముగ నిరూపింపజాలరు. పరధనముపట్లగూడ నిట్లే బసవడెంతయు విముఖుడు విరక్తుడునని ముందే చెప్పియుంటిని. అది యతనికి విషతుల్యము. బసవేశ్వరుని నిత్య జంగమారాధనముల కాతనికి ధన మెట్లు చేకూరుచున్నదని శంకించి, తోడి మంత్రి లాతడు రాజ భాండాగారమునందలి సొమ్మునే విచ్చలవిడిగా వెచ్చించుచున్నాడని బిజ్జలునకు కొండెములు చెప్పుటయు రాజా మాటలు విని కోశాగారమందలి ధనమును పలుమాఱులు లెక్కవేయించి చూడగా తఱుగేమియు గానరాక, పయిగా లెక్కకెక్కువగ నుండుటయు గాంచి లజ్జించి చాడీకోరులను శిక్షించుటయు మున్నగు కథలు బసవపురాణాదికముల వలన దెలియనగును, బసవనికి బిజ్జలుడొసంగు వేతనమువల్లనే యాతడీ జంగమారాధనములు నిర్వహింపగల్గెనాయని కొందఱు శంకింపవచ్చును. నిక్కమాలోచించిన బిజ్జలుని బొక్కసమందలి రొక్కము మాత్రి మిందుకు సరిపోవునా? అనన్య శరణ్య బుద్ధితో సంగమేశ్వరుని నమ్మియుండిన మహాభక్తున కసాధ్యమేముండును? ఇందుకు వలసిన

ఘన మొసంగినది సంగమేశ్వరుడే! జంగమముఖమున దాని నారగించి నదియు నాతడే! "ఒడయలధనమునే యొడయల కొసంగితి"నని హాజరు జవాబుగా బసవ డొసగెడి సమాధానమందలి పరమార్థ మిదియే. బసవని శీలమునకు మెఱవడి గూర్చిన గుణగణములగూర్చి యిట్టు లెంతయేని చెప్పదగును. ఇట్టి మహాపురుషుల స్మరణార్థముగ నిట్టి జయంతు లొనర్చుట వలని ప్రయోజనము వారి వర్తనముల నాదర్శములుగ మనమున నిడికొని కొంతవరకైన వానిని మన మనుసరింపగల్గుటనాఁడే నెఱవేఱ గలదు.

కావుననే "మనియుండెడి జన మెల్లను చనిపోయినవారి దివ్య సత్కథ లెలమిన్ వినవలె గనవలె మనవలె ననిమిషులకు నైన తెలియ వంత్యము వేమా" అని వేమనయోగి హెచ్చరించినాడు. కావున వీరశైవ సోదరు లెల్ల బసవని గుణగణ కీర్తనముతో తృప్తిపడక వానిని తమ వర్తనములకు వరవడిగా గ్రహించి యాచరించునాడే చరితార్థత నొంద గలరని మనవిచేయుచున్నాను.

'ధర్మభూషణ', 'ఐతిహాసిక సామ్రాట్'
'విమర్శకాగ్రేసర', 'శివశరణ',
శ్రీ బండారు తమ్మయ్యగారు
కాకినాడ.

# బసవేశ్వరుఁడు
# అనుభవ మంటపము.

★

12 వ శతాబ్దమందలి భారతదేశము, ధార్మికముగా, సామాజికముగా, రాజనైతికముగా విచ్ఛిత్తికల్గి వెలవెల బోవుచుండెను. ఇట్టి విచ్ఛిత్తి కేవలము కర్నాటకములోనే గాదు, దక్షిణభారతములోనే గాదు సంపూర్ణ భారతవర్షములోను, మఱియు, ప్రపంచమందలి యనేక భాగములలోను ఏర్పడి; సరియైన దారిగానక విలపించు చుండెను.

నాడు కర్నాటదేశమందు పేర్వేరు రాజుల పరిపాలన ముండెను. చాళుక్యభూపులు కర్ణాటోత్తర భాగమును పాలించుచుండిరి. ఈ చాళుక్య వంశములో చివరివాఁడైన త్రైలోక్యమల్లునకు విరుద్ధముగా, నాతని జైనసేనాని బిజ్జలుఁడు విద్రోహమొనర్చెను. తత్ఫలితముగా చాళుక్య రాజ్యమునకు బిజ్జలుఁడధిపతి యయ్యెను. కర్నాటక దక్షిణభాగములో హొయసల వంశీయుఁడైన విష్ణువర్ధన రాజుయొక్క యధికార ముండెను. చోళవంశీయుఁడైన కులోత్తుంగ మహారాజు కోపమునుండి తప్పించుకొని, దక్షిణదేశములోని వైష్ణవ ధర్మోపదేశియగు రామానుజాచార్యులవారు, ద్వార సముద్రమందలి విష్ణువర్ధన మహారాజును శరణు జొచ్చెను. వైష్ణవ మత సంస్థాపకుఁడైన రామానుజుఁడు విష్ణువర్ధన మహారాజునకు వైష్ణవ ధర్మోపదేశమొనర్చి యచ్చటనే నివసించుచు, కర్నాటకములో వైష్ణవ మతప్రచారముఁ గావించెను.

ఈ కాలమున సామాజిక క్షేత్రములో స్పృశ్యాస్పృశ్య, జాతి, మత, పంక్తివిభేదములు; వృత్తులనుబట్టి యుచ్చనీచ భావనలు, ఆర్థిక

శోషణ. ప్రలోభములు దేశమున తాండవించు చుండెను. ధార్మిక క్షేత్రములో అజ్ఞానము, అంధవిశ్వాసము ప్రబలి, మిథ్యాకర్మ కాండలతో దేశము నగ్ననృత్యమొనర్చు చుండెను.

ఇట్టి యంధకారావృత యుగమున, ధార్మికార్థిక సామాజిక క్షేత్రములందు క్రాంతియుత స్వప్రయత్నముల ద్వారా వీరశైవముతో ద్ధరణము గావించిన బసవేశ్వరుఁడు జననమందెను. తండ్రి మాదిరాజు తల్లి మాదలాంబిక. మాదిరాజు హింగుళేశ్వరబాగెవాడియందు వసించి యుండెను. ఈతఁడు చిన్న జాగీరున కధిపతియై యుండెను. చాలా కాలమువరకు మాదిరాజునకు సంతానము లేదు. నందీశ్వరుని వర ప్రసాదము వలన నా పుణ్యదంపతులకు బుత్రరత్న ముదయించెను. శిశువు కాలుసేతులు గదలింపకయు, కండ్లుతెరవకయు నిశ్చేతనునివలె బరుండియుండెను. సద్గుణమణులును, మహాభక్తులు నైన తల్లిదండ్రులు, భయభ్రాంతులైరి. ఇంతలోనే కప్పడి సంగమేశ్వరుని యాజ్ఞవలన జాత వేదమునిమాదిరాజుని యింటికరుదెంచి, బాలునకు భస్మరుద్రాక్ష లింగధార ణముల గావించి; వృషభేశ్వరుని వరప్రసాదమున జన్మించెను, గాన బస వేశ్వరుడఁని నామకరణ మొనర్చెను. బసవఁడు శైశవము నుండియు, మిక్కిలి కుశాగ్రబుద్ధియై చిన్నవయస్సులోనే శాస్త్రాగమముల యొక్క సంపూర్ణజ్ఞాన మార్జించెను. బసవేశ్వరుని యుపనయన సంస్కార విషయములో రెండు మతభేదములు కలవు. బసవపురాణాను సారము బసవని యష్టమవర్ష ప్రాయమున జననీ జనకులు వైభవోపేతముగా యజ్ఞోపవీత సంస్కారమున కేర్పాటులు గావించిరి. సమస్త బంధు వులు, విద్వాంసు లరుదెంచిరి. అరుదెంచిన వైదిక పండితులతో బసవేశ్వరుఁడు తన సంశయములను ప్రశ్నించెను. పండితులు సమా ధానములీయనైరి, యజ్ఞోపవీత ధారణము కర్మ బంధనమని విర సించెను. తల్లిదండ్రులను వదలి, చెలియలగు నాగలాంబికా సహిత

ముగా కృష్ణానదీ సంగమములో నున్న మలాపహారి కూడల సంగ మేశ్వరున కేగి యచ్చటనే నివసించెను.

13వ శతాబ్దపు చరిత్రకారకుడైన హరిహరుని మతానుసారము బసవేశ్వరుడు యజ్ఞోపవీత ధారణము గావించెను. కాని కొంతకాలము తర్వాత ననేక విధములైన యాశంకలుద్భవిల్లి, పండితులవలన వానికి సరియైన సమాధానములు పొందజాలక, షోడశవర్ష ప్రాయమున యజ్ఞోపవీతమును త్యజించి శివదీక్షా సంస్కార మందెను. సంగ మేశ్వరమందున్న కాలమున, మహామహిమాన్వితుడైన జాత వేదముని వలన నాధ్యాత్మిక క్షేత్రపదప్రవర్తియయ్యెను. బసవేశ్వరుడు తన పూర్తి వచనములన్నియు, నీ సంగమేశ్వరుని సంబోధించియే చెప్పెను.

కల్యాణ కటకమున కధీశ్వరుడైన బిజ్జలరాజుయొక్క ముఖ్య మంత్రి బలదేవ దండనాయకుడు. ఈతడు బసవేశ్వరునకు మేన మామ. బసవేశ్వరుని కుశాగ్రబుద్ధి, వేదాగమ పరిజ్ఞానము, ధార్మిక ప్రవర్తనములు విని మిక్కిలి ప్రభావితుడై, ఈతడు తన పుత్రిక యగు గంగాంబికతో బసవేశ్వరునకు పరిణయము గావించెను. కొన్నిసంవత్సరముల తర్వాత బలదేవ దండనాయకుడు మరణించెను. ఈ సమయము వరకు బసవేశ్వరుని కీర్తి దేశవ్యాప్త మయ్యెను. బిజ్జల రాజు బసవేశ్వరుని ప్రధానమంత్రి పదవి నలంకరించుట కామంత్రిం చెను. మొదట బసవేశ్వరుడు మంత్రిపదవి స్వీకరించుటకు మిక్కిలి యాందోళనము చెందెను. ఒక రాజ్యమునకు ప్రధానమంత్రియైన తర్వాత, తన సిద్ధాంత ప్రచారము, భక్తి గణార్చనము మఱియు దీనులకు, దుఃఖితులకు సహాయము చేయుట కనువై యుండదనియు, అత్యధిక రాజ్య కార్యకరణములచే, తన యాధ్యాత్మిక జీవనమునకు బాధకలుగుననియు తహతహ పడియెను. కాని బిజ్జలరాజు బసవేశ్వరుని

మిక్కిలి, యసునయించి "నేను నీయొక్క కార్యముల కేవిధమైన యాటంకము కలిగింపనని" ప్రతిజ్ఞచేసిన తర్వాత బసవఁడు మంత్రి పదవి నంగీకరించెను.

బిజ్జలుని యాస్థానములో శిద్ధణ్ణయను నొకమంత్రి యుండెను. అతనికి నీలాంబికయను నొకపుత్రిక కలదు. శిద్ధణ్ణదేహావసానము తర్వాత నా బాలికను బిజ్జలుఁడే కన్నపుత్రివలె పోషించెను. సుగుణ రాశియైన నీలాంబికాదేవిని బసవేశ్వరున కిచ్చి బిజ్జలుడే పాణిగ్రహణ మొనర్చెను.

విశ్వబంధుత్వ భావనచేతను, శాంతశమదమాది యుత్తమ గుణములచేతను, బసవేశ్వరుఁ డత్యంత శీఘ్రముగా లోకప్రియుఁ డయ్యెను. కొలఁదినాళ్ళలోనే తమ రాజ్యమున శాంతిభద్రతలు నెలకొల్పి, సంఘటిత పఱచి సుసంపన్న మొనర్చెను. ఇదేసమయమున బసవేశ్వరుఁడు కల్యాణమందనుభవ మంటప స్థాపనముఁ గావించెను. ఇయ్యది శిల్పి కళల కాలవాలమైన వేయి శిలాస్తంభముల చేత నత్యంత వైభవోపేతముగా నిర్మింపబడి యుండెనని చెప్పుదురు. ఈ యనుభవ మంటపము వీరశైవ ధర్మమునకు జన్మస్థానమని చెప్పుట యర్థమైనది. ఇది యొక ధార్మికసంస్థ. ఇందనుభవజ్ఞులైన స్త్రీ పురుషులు జాతివర్ణాది విభేదములు లేక పాల్గొనుచుండిరి. ధార్మిక, సామాజిక విషయ పరంపరలను గూర్చి వాద వివాదములు చేయుచుండిరి. ఇట్టిసంస్థ భారతదేశములోనే గాదు-ప్రపంచములో మఱెచ్చటను లేకుండెననుట అతిశయోక్తి కాజాలదు. ఈ సంస్థలోని సదస్యుల సంఖ్య మూఁడువందలకు పైగా నుండెను. ఇందరువదిమంది స్త్రీలు సదస్యులై యుండిరి సభ్యులెల్ల రొకరినిమించి యొకరు త్యాగశీలురు, ననుభవజ్ఞులు, విద్వాంసులు, ధార్మిక మూర్తులునై యొప్పిరి. ఈ సంస్థకు శూన్య సింహాసనాధీశ్వరుఁడైన పరమశివయోగి

యల్లను ప్రభువధ్యక్ష పీఠమలంకరించు చుండెను. సాధు శిరోమణి యగు మహాదేవియక్క శ్రీ సభ్యరాంధ్ర కాధిపత్యము వహించునది. బసవేశ్వరుని సప్పగిని యక్క నాగమ్మ సుపుత్రుఁడు మహాజ్ఞాని. శ్రీ చెన్నబసవేశ్వరుఁడాదిగా గలవారు సదస్యులై యుండిరి. ఈ సంస్థలోని సదస్సులందఱు, ఒకరినొక రన్నచెల్లెళ్ళవలె నెంచుకొనువారు, కన్న డములో జ్యేష్ఠసోదరుని అణ్ణయనియు, జ్యేష్ఠసోదరిని అక్కయనియు, పిలుచుకొందురు. బసవణ్ణ, అజగణ్ణ, అక్కమహాదేవి, సత్యక్క మున్నగు నామములు; వారిలోని పరస్పర స్నేహమును, గౌరవ భావములను వ్యక్తమొనర్చును.

అనుభవ మంటప స్థాపనములోని ముఖ్యోద్దేశ్యము; నీరసించి పోవుచున్న ధర్మమునకు జీవనప్రదానముఁ గావించుట. ఈ యుగ ధర్మము కేవలము వాగ్విచారము వరకే పరిమితమగుచు వచ్చుచుండెను. ధర్మముతో జీవనతత్వ సమావేశ మొనర్చుటకై బసవేశ్వరుఁడు క్రీ. శ. 1160 లో, అనుభవ మంటప స్థాపనముఁ గావించెను. ఈ యనుభవ మంటపానుభవముల యాధారముగా వీరశైవ ధర్మ సంఘటనము జరిఁగెను.

బసవేశ్వరునికి పూర్వపు సంస్కర్తలు, అవ్యవహారిక మైన ఆదర్శవాదము, మఱియు కర్మకాండను, ఆచరణాసాధ్యమైన విషయ ములతో జతపర్చి ప్రజాసామాన్యమునకు శిక్షణ మిచ్చుచూ వచ్చు చుండెను. కాని ప్రజల నిత్యజీవనమందట్టి శిక్షణము యొక్క వ్యవ హారరూపము నాచరణలో తెచ్చుట కసమర్థమై యుండెను. కావున, ననుభవమంటపముద్వారా వ్యక్తిగత సామూహికానుభవముల నాధార ముతో, వ్యర్థమైన బరువును ధర్మముయొక్క భుజస్కందముల నుండి దింపివైచిరి. బసవేశ్వరుఁడు తదనుయాయులు సంపూర్ణాచరణ యోగ్య

మైన మఱియు ననుభవార్హమైన సుదృఢ ధర్మ భవ్యభవన నిర్మాణము గావించిరి. ప్రజానీకమునకు నిత్యజీవనమందాచరణ సాధ్యమైన ధర్మ మును బోధించిరి. అనుభవమంటపములోని ధార్మిక నేతల సర్వసమ్మత మైన కథనమిట్లున్నది. జ్ఞానము మఱియు క్రియలోన విచ్ఛేద్యమైన సంబం ధము కలదనిరి. క్రియవినాజ్ఞానము సర్వదా అసంపూర్ణమనియు నసమర్థ మనియు వచించిరి. ఇదేవిషయములో చెన్నబసవేశ్వరుని ఈ క్రింది వచన తాత్పర్యము గమనింప దగి యున్నది.

"జ్ఞానమే క్రియ. క్రియనే జ్ఞానము, వీనిలో పరస్పర భేదమును కల్పించుట కేవలము తార్కికతామాత్రమే. ఏకమాత్ర కార్యము ద్వారానే యదార్థజ్ఞానము ప్రాప్తించును. "పరస్త్రీగమనము చేయరాదు" దీనిని తెలిసికొనుట జ్ఞానము; కాని యీ జ్ఞానమునకు వ్యవహార రూప మిచ్చుటతోడనే యది పూర్ణమగును. ఇట్టి జ్ఞానము కలిగియుండియు దానికి విరుద్ధాచరణముఁ గావించినచో నట్టి జ్ఞానము వలని ప్రయోజన మేమి ? జ్ఞాన విరుద్ధమైన కార్యముచేయు టజ్ఞానము గదా !

మహనీయమైన నిట్టి సంస్థయొక్కయు, క్రాంతివంతమైన తదా చరణల యొక్కయు, వార్తలు మెఱపువలె దేశదేశాంతరములలో వ్యాపించెను. దూరదూరములనుండి స్త్రీ పురుషులు సాధువులు, శివ భక్తులు కొల్లలుగా విచ్చేసిరి. పూర్వదిక్కులోని ఒరిస్సా, బెంగాల్ మరియు నుత్తరములోని కాశ్మీర, నేపాల్, గుర్జర, చోళ, చేర పాండ్య మున్నగు దేశముల నుంచి యనేక మహాత్ములు కర్ణాటకమునకు వచ్చి వీరశైవ ధర్మము యొక్క పునరుద్ధాన పునీతకార్యమునకు తమ సహ కారము నిచ్చిరి. కాశ్మీరదేశపు రాజు మరియు రాణి తమ రాజ్యమునకు తిలాంజలు లిచ్చి యిటకరుదెంచిరి. ఈ సంస్థ యొక్క సిద్ధాంతాను సారము శివదీక్షా పరుఁడైన ప్రత్యేక వ్యక్తియు, తమ జీవిక నిల్పుటకై

ఏదోయొక వృత్తిఁ జేయవలసి యుండెను. వృత్తిలో పెద్ద చిన్నయను తారతమ్యముండదు. కార్యముఁ జేయుటకూడా శివపూజలో నొకరూపమై యున్నది. ఇట్టి సిద్ధాంతములను పురస్కరించుకొని కాశ్మీర మహారాజు కల్యాణ పట్టణములోఁ, గట్టెలనమ్ముకొని జీవించుచు ననుభవ మంటపములో జ్ఞాన ప్రాప్తిఁ గావించుకొనెను. "మోళిగ" యనగా కట్టెల మోపని యర్థము. కట్టెలనమ్మి జీవించువాఁడు గాన మోళిగ మారయ్య యని ప్రసిద్ధికెక్కెను. ఈతని ధర్మపత్ని నాదరపూర్వకముగా మహాదేవి నామముతో గౌరవించు చుండిరి. వీరిద్దరనుభవ మంటపములోని సన్మాన్యులైన సభ్యులలో గణింప బడుచుండిరి. ఈ మాన్యత వారు రాజపరివారము నుండి వచ్చినందులకై యీయఁబడలేదు. వారి యనుపమ త్యాగము, అధ్యాత్మిక సాధనము, సహనశీలము, నిరాడంబర జీవనము, ఆదర్శ చరిత్ర, వినమ్రతల యొక్క కారణమున మిక్కిలి సన్మానింపబడిరి. ఇవ్విధముగనే దక్షిణ దేశపు, నొకానొక రాజు. సకలేశమాదరుసు రాజ్యత్యాగము గావించి వచ్చి, యనుభవ మంటపములో చేరెను. మరియు, గుర్జర (గుజరాత్) దేశమునుండి యొక మహా ధనిక వ్యాపారి ఆదయ్యయు, కళింగ (ఒరిస్సా) దేశమునుండి మరుళ శంకర దేవయ్యయు, కుంతల రాజ్యమునుండి యేకాంత రామయ్యయు. ఆంధ్ర దేశమునుండి మైధున రామయ్యయు, సొన్నలాపురి (సోళాపురము) సిద్ధరామయ్యయు, వనవాసి (కార్వాడ్) నుంచి ప్రభుదేవుఁడు (అల్లమ ప్రభువు) మఱియు హిప్పరిగనుండి మడివాళ మాచయ్యయు మున్నగు వారు కల్యాణమునకు విచ్చేసి, బసవనిచేఁ బ్రేరితులై ఈ మహాకార్యమునకు సహాయోగులైరి. మఱియు మహాదేవియక్క, సత్యక్క, ముక్తక్క, అజగణ్ణగారి యధ్యక్షతన బళ్లిగాని క్షేత్రమునుంచి యిచ్చటకు విచ్చేసియుండిరి. (బళ్లిగాని నామముతో నైతిహాసిక మహత్వ స్థానము మైసూరు రాష్ట్రములో కలదు).

ఈ సంస్థ యనేకత్వములో నేకత్వము కల్పించెను. జాతి, వర్ణ, మత, లింగభేదరహితమైన సమాజమునకు నొక చక్కని యుదాహరణమై యుండెను. శివసంస్కారమందిన రాజు, మంత్రి, వ్యాపారి, మోచి, చాకలి, మంగలి, భుజమునకు భుజము తగిలించి యొక్కవంచి పనులు చేయుచుండిరి. నీచమైన వృత్తులుగలవారుగా భావింపబడు అనేక ధార్మికమూర్తు లిందుండిరి. మడివాళ మాచయ్య (చాకలి) జేడరదాసయ్య (సాలె) అంబిగర చౌడయ్య (నావికుడు) కిన్నర బ్రహ్మయ్య (కమసాలి). డోహరకక్కయ్య.(చర్మకారకుడు).మాదర చెన్నయ్య(మోచి) గాణద కన్నప్ప (గాండ్ల), వైద్య సంగయ్య (చికిత్సకుడు), కిరాత సంగయ్య (వేటకాడు). మేదర కేతయ్య (మేదరవాడు). దక్కయ్య (తమ్మళి) తురుగాహి రామన్న (గొల్ల) నులియ చందయ్య (నులక త్రాళ్ళు పేనువాడు), శంకర దాసయ్య (దర్జీ). హడపద అప్పణ్ణ (మంగలి), వీరంద ఱట్టి వృత్తులలో జీవించు, జ్ఞానులును, మహాభక్తులునై యుండిరి. బసవేశ్వరుడు తదనుయాయులు వృత్తులం దుచ్చ నీచములు లేవనిరి. ఎవడు మంచి పనిని జేయునో వాడే యుత్కృష్టుడు. ఎవడు నీచకార్యముల కొడిగట్టునో వాడే నీచుడని తెలియపర్చిరి. పురుషులవలెనే సాధుశిరోమణులు, స్త్రీలుకూడా స్వతః దేహకష్టముచే నార్జించి జీవించవలయునను నిబంధనచే గట్టె లమ్మియు, పిండి విసరియు, రాట్న మొడికియు, బియ్యము దంచియు జీవించుచుండిరి. ఆయ దక్కయ్య మారయ్య వీరశైవ ధర్మ కణాదులని చెప్పుట కర్హులు. వారు చేలు కోసికొని పోయిన తర్వాత విడువబడిన ధాన్యము నేరి యేరి తెచ్చుకొని జీవించుచుండిరి.

విభిన్న దేశకాలములం దవతరించిన సాధుశిరోమణు లాకాశము లోని నక్షత్రములవలె వినశ్వరులై వెలింగిరి. అనుభవమంటపము పునీతమైన యాకాశగంగ వంటిది. దీనిలో కాంతివంతములైన అనేక

నక్షత్రము లోకే కాలములో నొకే స్థానమం దొకటిగా చేరినవి. ప్రాచీన కాలమునం దనేక పర్యాయములు, యజ్ఞయాగాది క్రతువులును, పెద్ద పెద్ద సమ్మేళనములును ఋషులు, తపోధనులు, ధార్మికమూర్తులు, సన్యాసులు ఒకచో చేరుచుండిరి. కాని యనుభవమంటపమందనేక స్థానముల నుండి మహనీయులైన స్త్రీ పురుషులు వచ్చేసి, యొకచో జేరుటే కాదు. సంవత్సరముల కొలది కలసియుండి సర్వవిధములైన భేదభావనలు మఱచి. స్వతంత్రపూర్వకముగా కలసి మెలసి సంఘోద్ధరణము చేయుటకు( దమతమ యనుభవముల నాధారముగా వాదవివాదములు చేసి, వానిని నిష్కర్షగావించి సిద్ధాంతీకరించిరి. అట్టి సిద్ధాంతములను తమ జీవనమందాచరణలో పెట్టి చూపిరి. భారత ఏషియా ఖండములలోనే కాదు. మానవజాతియొక్క యితిహాసమందీ సంస్థవంటిది మఱియొకటి జనించియుండలేదు.

ఈ సంస్థ జనకమహారాజుయొక్కయు. నుపనిషత్కాలము యొక్కయు, బుద్ధాశోకులయొక్కయు కాలమును జ్ఞప్తికి దెచ్చుచున్నవి. స్త్రీ పురుషుల వాదవివాదములు, వారి యాధ్యాత్మిక పాండిత్య ప్రతిభ కొన్ని శతాబ్దములకు పూర్వపు స్వర్ణయుగమును జ్ఞప్తికి దెచ్చుచున్నది. ఆ యుగములోని నారీమణులు భారతమాతలు. అవిద్యావంతులై, యంధ విశ్వాసములు గలవారై హీనతాబంధనములలో జిక్కియుండలేదు. అప్పుడు వారు జీవనముయొక్క ప్రతిక్షేత్రమందును పురుషుల సహ ధర్మచారిణులై, సమానాధికారిణులై యున్నందున, వారు పాండిత్యము, ప్రజ్ఞానము, వక్తృత్వము, స్వతంత్రబుద్ధి వీనిచే సమ్మానితలైయుండిరి. అల్లమ ప్రభువు మఱియు అక్కమహాదేవియొక్క కథనోపకథనములు. యాజ్ఞవల్క్యుడు మఱియు మైత్రేయియొక్కయు, బుద్ధుడు మఱియు మహాప్రజాపతి గౌతమియొక్కయు వ్యాఖ్యానములు జ్ఞప్తికి( దెచ్చును.

అక్కమహాదేవి వీరశైవ ధర్మమునకు మీరాబాయివంటి దన వచ్చును. ఆధ్యాత్మిక విద్యావిషయికముగా మీరాబాయికన్న మిక్కిలి యున్నతస్థాన మలంకరించినట్లగపడును. ఈ మహాత్మురాలా జీవనము కుమారిగనే యుండెను. అతి దీర్ఘములైన శిరోజములే నీ మహనీయు రాలి శరీరమును దాచుచుండెను. ఈమె యెవ్విధమైన వస్త్రధారణ గావించలేదు. ఎల్లప్పు డరణ్యములలో సంచరించుచు ననుభవమంట పములోని గోష్ఠులలో పాల్గొనుచుండెను. ఈ మంటపములోని సభ్యు లెల్లరీయమను సమ్మానపూర్వకముగా "అక్క" యని సంబోధించు వారు.

వీరశైవ ధర్మమందలి శ్రేష్ఠమైన సిద్ధాంత సంఘటనముయొక్క శ్రేయస్సు అనుభవమంటపమునకు జెందినది. ఇష్టలింగ రూపములోఁ జేయబడిన సాకార నిరాకారపూజా సమన్వయ మభూత పూర్వము. గహన తమా ధ్యాత్మికార్థములతో నిండిన నీ విధానము సామాన్యులకును నుత్కృష్టులగు సాధకులకును సమానముగా నుపయుక్తమైనది. లింగ దీక్షా సంస్కారము ద్వారా ఈ విధానము సమస్తమగు వారికొఱకు ధర్మ ముక్తిద్వారములను తెఱచియుంచినది. భారతదేశమునకే కాదు, విశ్వ మందనేక గంభీర సమస్యలయొక్క ఉచ్ఛ, నీచ, స్పృశ్య, అస్పృశ్య, పురుష, స్త్రీ, అవర్ణ, సవర్ణాది విభేదములను సమూలముగా నశింపఁజేయు టకై యెనిమిది వందల సంవత్సరములకుఁ బూర్వము జేయఁబడిన నీ ప్రయాస యెంత మనోహరము మహత్వమునై యుండెను! బంధుత్వ సమానాధికారయుతమగు నాధారములపైన వర్గరహితమే కాదు, ఏ విధ మైన భేదభావములు లేని సమాజ నిర్మాణ పథకము నెంత ప్రశంసించి నను తక్కువయే. యుగయుగములనుండి యనేక విధములైన బంధ నములలోఁ జిక్కువడియున్న నారీమణుల కీ సంస్థ స్వతంత్ర ప్రదా

నము( గావించెను. అనేక మహిళా సాధు శిరోమణుల వచనములు, వచనశాస్త్రమును సమృద్ధమొనర్చెను. మరియు స్త్రీ లే రంగమందును తమ పురుషులకన్నను తీసిపోనివారని మతౌకమాటు ప్రపంచమునకు చూపించబడెను. పతితులైన అనేక స్త్రీ పురుషుల నీ సంస్థ యుదార పూర్వకమైన ప్రేమచేత పాపపంకమునుండి యుద్ధరించి వారి నున్న తాధ్యాత్మిక శిఖర మారోహింప జేసెను. ఈ సంస్థ కన్నడ సాహిత్య మునకు వచన వాఙ్మయదానము గావించెను. ఈ వచనములు గద్యములో నున్నను, కావ్యమాధుర్యము కల్గి. రాగబద్ధ విశిష్టతను నంతరించుకొని యున్నది. ఆధ్యాత్మికానుభవము, ఉపదేశము, కావ్య, గద్య, సంగీతము లతో నిండిన వచనము లందలి పంచామృత బిందువులు తను మనసుల రసాప్లావిత మొనర్చి పవిత్రము( జేయును.

బసవేశ్వరునకు పూర్వపు కవులు. సాహితీవేత్తలు సంస్కృత భాషలో కఠినమైన రచనలు గావించిరి. కర్నాటక మహాకవులైన పన్న మఱియు పంప కవులచే వ్రాయ(బడిన చంపూ కావ్యములు సర్వసాధా రణు లర్థము(జేసికొన జాలకుండిరి. శివశరణులు తమ తత్త్వోపదేశ రూపములైన వచనములను సర్వసాధారణుల కర్థమగు సులభ వ్యావ హారిక కన్నడములో రచించి ప్రజల ముందుంచిరి. కర్నాటక సాహి త్యములో వచన శాస్త్రమున కపూర్వగౌరవ సమ్మానములు కలవు. వేదా గమములతో సమానమైన సమ్మానము వీనికి కలదు. శివశరణు లెల్ల రసంఖ్యాకములైన వచనములు వ్రాసిరి. బసవేశ్వరు( డొక్కడే నాల్గు లక్షల యిరువది నాల్గువేల వచనములు వ్రాసినట్లు చెప్పుదురు. ఇప్పు డిన్ని వచనములు లభ్యమగుటలేదు.

ఈ సంస్థ సదస్యులకు, తదనుయాయులకు శారీరకశ్రమ పాఠ మును చదివించినది. శారీరిక శ్రమకు ధార్మిక మహాత్యము కల్పించి,

జనుల కార్థిక, సామాజిక జీవనమునందు క్రాంతియుత పరివర్తనము కలుగఁజేసినది. ఎవ్వరును పరాన్నభుక్కులు కాఁరాదు. ఉచ్చ తరగతుల నుండి నిమ్నతరగతులవారి కన్యాయము జరుగరాదు. వృత్తులు చెసికొనుట ప్రభువు పూజలో నొక భాగముగా గణించి వానికి పవిత్రత్వము కల్పించుట ద్వారా వాస్తవిక సమాజవాదమును స్థాపించు ప్రయత్నము గావించినది.

కార్లయిల్ మఱియు రస్కిన్ శారీరక శ్రమ మహత్యపాఠమును మాత్రమే చదివించిరి. కాని యనుభవమంటపము శ్రమలోని పవిత్రత యొక్క శిక్షణ మిచ్చినది. శిక్షణ మిచ్చుటయే కాదు- ఉన్నత పదవి, శ్రేణి, వర్గములనుండి విచ్చేసిన నిందలి సదస్సులు నీచాతి నీచమని చెప్పబడు వృత్తులతో జీవిక సంపాదించుకొని ఈశిక్షణమును కార్యరూపములో ఫలింపఁజేసినది. ఆధ్యాత్మిక సిద్ధాంతముల నితరులకు బోధించుట సులభము. కాని వానిని తమ జీవనములో నాచరణమందు పెట్టి చూపుటత్యంత కఠినము. కార్యరూపములో ఫలింపజేయని సిద్ధాంతము వ్యర్థమైనదేకాదు- హానికారకమైనది కూడ.

అనుభవమంటపము సమాజము యొక్క యంధ విశ్వాసములను మఱియు సూతకములను మొదలగు తర్కవిరుద్ధములగు మిథ్యాబంధనములనుంచి విడుదలచేసినది. అంగమున ధరింపబడిన లింగము జ్యోతి పుంజము. ఇది సర్వసూతకములను సర్వ దోషములను భస్మము గావించును. భోజనమంతయు శివుని ప్రసాదము. శివ ప్రసాదము కావున వీరశైవులకుచ్ఛిష్ట దోషము లేదు. ఇట్టి సిద్ధాంతము లాధారముగా గొని జనన సూతకము, మరణసూతకము, రజస్సూతకము జాతిసూతకము మఱియు నుచ్ఛిష్టసూతకములను పంచసూతకములు మన్నించబడలేదు. ఈనాదము జ్ఞానభక్తి మఱియు కర్మలయొక్క పారస్పరిక జ్యేష కనిష్ఠత్వ వివాదముల నంతమొందించెను. గురులింగ జంగమములను సమానరూపముగా

నాచరించుటే కాదు, వానికభేదము కల్పింప బడెను. ఇదియే క్రమముగా జ్ఞానభక్తి కర్మలయొక్క పరిస్ఫుట రూపములు. ముక్తిద్వారము గృహస్థునికి మఱియు సన్యాసికి సమానముగానే తెరువబడి యున్నది. జీవన్ముక్తి మార్గమందు గృహస్థజీవనము బాధకముగాదు. ఇట్టియభిప్రాయము సర్వసమ్మతమై యుండెను. బసవేశ్వరుఁడు మోళిగమారయ్యా గృహస్థ జీవనము గడుపుచు, నున్నతాధ్యాత్మిక శిఖరము లారోహించి యీ సిద్ధాంతమును ప్రమాణము గావించిరి.

మనస్సు ననుశాసించుటయందు, తమ మఱపులకు పశ్చాత్తాపము మఱియు శిక్షారూపముగా "ముళ్ళావిగేయకాయక మావిష్కరింప బడెను. పశ్చాత్తము మరియు నాత్మశుద్ధి నిశ్చయించే వ్యక్తులు మద్యాహ్నపు టెండలలో గంటలకొలఁది ముండ్లవంటి చీలలుగల పాదుకలపైన నిలువఁబడు చుండిరి. ఎందఱో యిట్టి పాదుకలుంచుకొని యుండిరి. వారాపాదుకలపైన నేలనిలచి యుందురో తెల్పుచు జీవిక సంపాదించు కొనువారు. కావున దీనిని కాయక (వృత్తి) యని చెప్పిరి. బలవంతముగా నిట్టిశిక్ష యెవ్వరిపైనను మోపబడకుండెను. తమ్ముతాము సంస్కరించుకొనుటకే యీ పద్ధతి ప్రవేశపెట్టబడి యుండెను.

బసవనికి మఱియు ననుభవ మంటపమున కభిన్నము. ఇవి పరస్పరమైనవిగాఁ జూడఁబడవు. కల్యాణపు జైనరాజు బిజ్జలుని ప్రధాన మంత్రి రూపకముగా బసవేశ్వరున కైదువేల స్వర్ణముద్రలు మాసిక వేతనము దొఱుకుచుండెను. ఈ మొత్తము ధనమంతయు భక్తులకు నవసరమున్న జనులకు పంచుచు నెలరాకమున్నే బసవఁడా ధనమును వ్యయించు చుండెను. విభిన్న ప్రాంతములోని భక్తుల నందఱు బసవేశ్వరుఁడే నొకచో కూర్చెను. వారికి సేవా సత్కారములుచేసి యనుభవ మంటపమందలి కార్యములందు ప్రముఖపాత్ర వహించుచుండెను. అయినను ముఖ్యసభాపతి యల్లప్రభువై యుండెను. అజ్ఞానము, అంధ

విశ్వాసము, అనాచారము అప్రాకృతిక బంధనములు. అనేకములైన మిథ్యా భేదాదికములకు విరుద్ధముగా తుఫాను రూపమైన క్రాంతిని విల బెట్టి ప్రతిక్షేత్రములో నాదర్శకాత్మిక మైన సంస్కరణ ప్రవేశపెట్టిన మహా సంస్కర్త బసవేశ్వరుఁడు దక్షిణదేశపు బుద్ధుఁడని తెలియుట సర్వదా యుచితము. ఈ వ్యాసమును రచించుటలో తోడ్పడన హిందీ వీరశైవ ధర్మ బసవ కల్యాణమును గ్రంథకర్తల కభివందనములు.

ఇట్లు, విద్వాన్ బెళగంధిమఠం
వీరభద్రశర్మ
30—4—59

# మహానుభావుడగు బసవేశ్వరుడు



" రామచరితంబు । రాక్షస హరణంబు,
బంధునాశనంబు । భారతంబు.
పాపసంహరణంబు । బసవ పురాణంబు.
విశ్వదాభిరామ వినుర వేమా.

(వేమన యోగి)

ప్రపంచము పరివర్తన శీలము గలది. కాలమాన పరిస్థితులు మారుచు నుండుటవలన, వానికి అనుకరణముగా నుండునట్లు అప్పుడప్పుడు సంఘములందలి ఆచారములను, పద్ధతులను సంస్కరించు అవసరమేర్పడు చుండును. బౌద్ధుని కాలమునందు వేదకాలమునాటి సంఘ నియమములు, సామాజిక ఆచరణలు అనేకములు తారుమారై నందున, బుద్ధుడు వానిని సంస్కరించి నూతన సమాజ రచన యొనరించెను. అటులనే పన్నెండవ శతాబ్దమున భారత దేశమునందు, ముఖ్యముగా కన్నడప్రాంతము నందు ధార్మిక, సామాజిక, నైతిక, మానసిక, రాజకీయ పరిస్థితులు వికృతరూపము నొందుటచే మానవజాతి విప్లవమునకు గురియగు చుండెను. అప్పుడు బసవాది శివశరణులు జాతి, మత వివక్షతలను ఖండించి, వీరశైవ మతమును సర్వజన సమాచరణీయముగా నుండునట్లు పునరుద్ధరించి, హిందూ మతమునందు గొప్పక్రాంతిని కలుగజేసి ప్రపంచమునకు శాంతి సందేశమును ప్రసాదించిరి.

బసవేశ్వరుడు అనాటి శివశరణు లొనరించిన నూతన సమాజ రచనయందు ముఖ్య నాయకత్వమును వహించి యుండెను. కనుక అతనితత్త్వములే ఆ క్రాంతికి మూలములని భావింపబడుట సహజము. బసవేశ్వరుడు వీరశైవ ధర్మమునకు జెందినవాడైనను, ఆతడుపదేశించిన తత్త్వములు, ఆతడొనరించిన సంస్కరణములు, వీరశైవులకే కాక భారతీయులందరకును, వేయేల మానవజాతి కంతటకును, అనువర్తనీయముగా నున్నవని; అతని వచనముల ననుభవము జేసుకొనిన మహానుభావులందరును అభిప్రాయ పడుచున్నారు. విశ్వశాంతికి పునాదియగు బసవని తత్త్వములను మనము ఆచరణయందు తేగలిగినచో పరస్పర ద్వేషాసూయలు, ఉచ్చనీచతారతమ్యములు నశించి, సర్వసమానత, సర్వజీవదయాపరత్వ మేర్పడి మన యిహపరసఖముల ననుభవింపవచ్చునను నది నిశ్చయాంశము. వీరశైవ మత మూల సూత్రమగు శివానుభవము, తదంగములగు అష్టావర్ణ పంచాచారములు మఱియు షట్థ్సలములతోబాటు, సమాజవాద పరమగు సంఘము (Socialistic Patron of Society) నకు. నేడు అత్యంత అవసరమని తలంచబడుచున్న, అహింస, అస్పృశ్యతానివారణ, హరిజనోద్ధరణము, సర్వ సహోదర భావము, స్త్రీ స్వాతంత్ర్యము, ధనాధికముల విరోధములనే గాక, నొకయడుగు ముందుకు వేయుచు, ఐశ్వర్య జీవననిరసనము, పరస్త్రీ పరద్రవ్యములయందు విరక్తి, సత్యాచరణము, నిష్కామక్రియ, నిస్వార్థ నిరాడంబరజీవనము, కాయక జీవనము, జీవదయ, మొదలగు ఉజ్జ్వల తత్త్వముల, నవగాహన మొనర్చుకొని, తాను నుడివినట్లు నడుచుచు, యితరు లాచరించు నట్లొనర్చిన మహానుభావుడు మన బసవేశ్వరుడు. నేటి సంస్కర్తలే ధార్మిక, సామాజికార్థిక, సంస్కరణములను ప్రతిపాదించుచున్నారో, అట్టి సంస్కరణములనెల్ల నేటికి దాదాపు 800 సంవత్సరముల క్రితమే, బసవాది శివశరణులు జనవిరుద్ధము. ప్రతి

కూలుర ప్రతిఘటనము. రాజభయములకు వెరువక నిరాఘాటముగా ఆచరణయందు తెచ్చిన శ్రేయస్సును బొందియున్నారు.

బసవేశ్వరుడొనరించిన సమాజ రచనను దెలుసుకొనిన, అమర జీవులగు మన బాపూజీ 1925 వ సంవత్సరమున, బెళగామయందొన రించిన, ఉపన్యాసమునందు "నేను వీరశైవులకు జెప్పవలసినదేమియు లేదు; నేను వారికి చెప్పవలసినదంతయు, వారి ధార్మిక మహాపురుష డగు బసవేశ్వరుడు 800 సంవత్సరములకుపూర్వమే చెప్పియున్నా"రని ఉద్ఘోషించిరి. బసవని వచనములను పారజూచిన, మనపూర్వపు హైద్రా బాద రాజ్య ముఖ్యమంత్రులును, నేడు కేరళ రాష్ట్ర పాలకులు (Governor) నగు శ్రీ శ్రీ డా॥ బూర్గుల రామకృష్ణరావుగారు "వీర శైవమతము భక్తి మతములలో ముఖ్యమైనది. మిగుల ప్రాచీనమగు నీమతమును పురస్కరించుకొని, సాహసుడగు బసవేశ్వరుడు జాతి విశిష్టతపై యాధారపడియున్న వర్ణకల్పనను తీవ్రముగా ఖండించుచు, శుష్కవైదిక కర్మాచారములను నిరసించుచు, హిందూజాతియందు సంజీవిని పోసెను.........(అతడు) హిందూధర్మమును రక్షించిన గొప్ప సంస్కర్త" యని నొక్కి వక్కాణించియున్నారు. పౌర్వాత్య చరిత్ర సంశోధకులగు Sir James Cambel, "The present day social reformer in India is but speaking of the language and seeking to enforce the mined of Basava" యని యధికారవాణితో నుడివియున్నారు. మొత్తముపై సుప్రసిద్ధ కన్నడ రచయితలగు శ్రీ యం. ఆర్. శ్రీని వాసమూర్తి B. A. గారు "బసవేశ్వరుడు, వీరశైవులకుమాత్రమే సంబంధపడినవాడు గాడు; కర్ణాటక దేశమునకు మాత్రమే సంబంధ పడినవాడు గాడు; ఆయన భరతఖండము నంతటికిని, ప్రపంచము

నంతకును సంబంధపడిన మహాపురుష" డని యభిప్రాయ పడి యున్నారు.

మహానుభావుడగు బసవేశ్వరుని, శాంతిప్రవర్తనము, అహింసా, దయా, క్షమదమాది సాధకములను గుర్తెరింగి, "యుగప్రవర్తక బసవన్న" యను పుస్తకమునందు, "రావణుని జంపి విభీషణునికి పట్టాభిషేక మొనరించుటకన్న, రావణునే విభీషణునిగా మార్పుచేయు ధోరణి బసవన్న"గారిదని, గ్రంథకర్త "చింతామణి"గారు ప్రశంసించి యున్నారు. ప్రొఫేసర్ వాడియాగారు, లింగధారణయను సార్వత్రిక చిహ్నముద్వారా భగవద్భక్తుల నెల్లరను ప్రేమాను బంధితుల నొనరించి, భూలోకమునందు భక్తి ప్రభుత్వమును స్థాపించవలయునను నదే, బసవన్నగారి ఉద్దేశ్యమై యుండె"నని ప్రశంసించియున్నారు.

గనుకనే, వేమన యోగి భారత దేశము నందలి సుప్రసిద్ధ ఐతిహాసిక పురాణంబులగు రామాయణ, మహాభారతములను, రజోతమ గుణములనను సరించి హింసాత్మకమగు యుద్ధములను జేయుటకు పురికొల్పునవి యని నిర్వచించుచు: బసవపురాణమును సత్త్వ గుణాన్విత మగు శాంతి అహింసల ద్వారా కార్యసాధనము చేయుదారిని చూపుచు, పతితోద్ధార మొనరించిన మహానుభావుని చరితంబని ఆనందమానసుండై గాయన మొనరించెను.

ఇట్టి మహానుభావుడగు, మన బసవేశ్వరుని ఉదాత్తమగు తత్త్వములు దేశమునందంతట ప్రచారమొంది, ఆచరణయందు రావలయునను సదుద్దేశముతో మన భారత ప్రభుత్వమువారు, ఆ మహాపురుషుని చిత్రముతోబాటు "అక్షర లక్ష వెలగట్టదగిన సుభాషితంబుల"గు వచనములనుకూడా అచ్చొత్తించి సార్వజనిక స్థలములయం దుంచుచున్నారు. కావున, మనమందరము, ఆ మహానుభావుని జన్మదినమగు

నేటినుండి. ఆతని ఉదాత్తమగు తత్త్వములను, భక్తిసూత్రములను, శాంతి సందేశములను, సమన్వయించుకొని, వానిని మన ఆచరణ యందు తెచ్చుటకు ప్రారంభించ వలయునని మనవి.

'శరణు'. 'శివశరణ',

రేకళిగెమఠము వీరయ్య,

హైదారాబాదు.

# బసవేశ్వరుని విశ్వధర్మము

★

"మర్త్యలోకమనునది కర్తయొక్క కర్మశాలయయ్యా,
ఇక్కడచెల్లు వారక్కడను చెల్లుదురయ్యా"
"నాకన్న పిన్నలులేరు, శివభక్తులకన్న పెద్దలులేరు,"
"దయలేని ధర్మమదేనయ్యా ? దయయే ధర్మమునకు
మూలమయ్యా"
(బసవ వచనామృతము 36, 96, 54.)

భరతఖండమందవతరించిన మహాపురుషులందు కల్యాణ బసవేశ్వరుని పేరు విరాజమానమై యున్నది. శ్రీరాముడు నీతి ధర్మమునకు శ్రీ కృష్ణుడు కర్మయోగమునకు, బుద్ధదేవుడు సమత మఱియు నను కంపమునకు, మహావీరు డహింసకు, శంకరాచార్యు డద్వైత జ్ఞానమునకు, అశోక సార్వభౌముడు విశ్వప్రేమకు, మహాత్మాగాంధి రాష్ట్రీయ స్వాతంత్ర్యమునకు కీర్తి గడించినటులే, శ్రీ బసవేశ్వరుడు భక్తియోగమునకు ప్రఖ్యాతుడై యున్నాడు. అందుగురించియే బసవని కాలమును 'భక్తియుగ' మని పిలుచుట వాడుకయై యున్నది. అనేక కవులు శరణులు, బసవేశ్వరుని గురించి భక్తియుగాచార్యుడని, భక్తి భాండారి యని, కొనియాడి యుండుట ఈ అర్థమునుంచియే యుండవచ్చును. దీనికి "భక్తిప్రియుడు మా కూడల సంగమ దేవుడు." యను బసవణ్ణ గారి వచనము కూడ సాక్షిగా నున్నది.

బసవేశ్వరుని వచనసారమును, నాతని జీవనపు గుట్టు గుర్తులను తెలసిన వారా మహనీయుని కేవలము కర్నాటకమునకే కాక, విశాల భారతమునకే కాక సకల మానవజాతికిని హితచింతకుడని భావించెదరు. ఈ విషయమును తెలియుటకు,

"చంపు నతడే మాదిగ, మలినమును దినునతడే
మాల, కులమేమో ? ఎవరికులమేమో ?
సకల జీవాత్మలకు క్షేమమునే కోరు
మాకూడల సంగని శరణులే కులజులు."

(బ. వ. పరిచయము)

బసవేశ్వరుడు నుడివిన వచనము మనకు కరదర్పణమై యున్నది. పురుషసూక్త మంత్రమందలి 'శన్నో అస్తు ద్విపదేశం చతుష్పదే' అను మంత్రమందు ఋషులు రెండు కాళ్ల మరియు నాలుగు కాళ్ళ ప్రాణులకు సుఖమగుగాక యని చెప్పియున్నారు. అయినను బసవేశ్వరుని వచనము లందున్న 'సకల జీవాత్మలకు' యనుమాట, వేదమంత్రముకన్న కొంత విశాలముగ నున్నదనుమాట నందఱును యొప్పుకొన వలసివచ్చును. బసవేశ్వరుడు చేయబూను కొనిన మహత్కార్యము లన్నియు విశ్వము యొక్క హితమునకు, విశ్వధర్మ ప్రగతికై యున్నదను అంశము మనకు వారి వచనముల వలననే తెలియవచ్చు చున్నది.

## మానవులందఱు సమానులు

యుగపురుషుడగు బసవేశ్వరుడు సమస్త మానవజాతిని ఆత్మీయ ముగా ప్రేమించుచుండెనని యనుటకు, "బ్రాహ్మణులు మొదలుకొని అంత్యజులవరకు శివభక్తులగు వారందఱి నొకచే యనెద" నను

వారి వచనములు నిదర్శనములై యున్నవి. బసవేశ్వరుని దృష్టియందు "మానవులందఱును పరమేశ్వరుని యందు కృతజ్ఞులై యుండవలయును. అతని యనుగ్రహమునకు పాత్రులగుటకు సత్యమార్గమందు నడుచుకొనవలయును." అనునది స్పష్టమై యున్నది. బసవడు తనను పెద్దవాడని భావించక నింకొకని చిన్న వాడని భావించక "నాకన్న చిన్నవారులేరు శివభక్తులకన్న పెద్దవారులేర"ను దాసోహభావముచే నడచు చుండినట్లీ వచనము సాక్షిమైయున్నది. సమాజమునకు, దేశమునకు, తన ఆత్మోన్నతికి చెడగగునటుల దుర్నడత నడచువారలను శివశరణులు 'భవి' యని పిలుచుచుండిరి. తాను సజ్జనుడై సమాజమునకు, దేశమునకు హితము నపేక్షించి 'కాయకమే కైలాస' మని తెలిసికొని కార్యతత్పరులగు సుజనులను 'శరణులు' అని భావించుచుండెరి. మానవులందరి హృదయములందు పరమాత్ముని యంశమున్నదని బసవేశ్వరుడు బాగుగా నెఱిఁగియుండెను. వారు మాటలచేతనేకాక నడతయందును అద్వైతులై యుండిరి. శివోహం అను భావనగలవారై యుండిరి.

"సెట్టియందునా సిరియాళుని ? మడివాలు డందునా
మాచయ్యను? మాదిగయందునా చెన్నయ్యను ? డోహారు
దందునా కక్కయ్యను ? నేను బ్రాహ్మణుఁడ ననినచో కూడల
సంగయ్య నగునయ్యా!" బసవ వచనామృతము 57వ వచనము.

ఇత్యాదివారి వచనములు, వారి విశ్వమానవహిత దృష్టిని మనకు చక్కగా బోధించుచున్నవి. మరియు వారి విశ్వప్రేమకు నిదర్శనములై యున్నవి

# స్త్రీ పురుషులందఱు సమానులు

బసవని ధర్మమందు వారి మోక్షసాధన మార్గమందు స్త్రీ, పురుషులు సమానులనునది గమనార్హమగు సంగతియై యున్నది. ఉపనిషత్తుల కాలమందును గౌతమబుద్ధుని కాలమందును, స్త్రీలకు ధార్మిక స్వాతంత్ర్యము లభించియుండెనని నిదర్శనము లున్నవి. అటుతరువాత జైన మఱియు వైదికమతముల ప్రాబల్యముచేతనే స్త్రీజాతిని హీనముగా చూచినట్లు గ్రంథములందు నిదర్శనములున్నవి. బసవేశ్వరుడు సమాజముయొక్క లోపదోషములను పరిహరించెను. వారి యనుభవమంటపమందు, అక్క నాగమ్మ, అక్క మహాదేవి, సత్యక్క, రెమ్మవ్వ, రేచవ్వ, మహాదేవమ్మ, లక్కమ్మ, లింగమ్మ, నీలాంబిక మొదలగు శివశరణులు ధార్మిక మహత్వమును బడసియుండిరి. వారు ప్రభుదేవుడు సిద్ధరామేశ్వరుడు, చెన్న బసవేశ్వరుడు మొదలగు మహాత్ముల గౌరవమునకు పాత్రులై మంటప సదస్యత్వమును వహించినట్లు నిదర్శనము లున్నవి. స్త్రీ, సమాజమునకు మాతృస్వరూపిణి, మంత్రస్వరూపిణియని శరణులు తెలుసికొనియుండిరి. కావుననే పరవనితను మహాదేవియని సంబోధించి స్త్రీలయందు తమకుండు యపారమగు గౌరవమును వ్యక్తపరచి యున్నారు. బసవేశ్వరుని యట్టి యుదాత్త తత్త్వ ఫలముచేత విశ్వమును ఆశ్చర్యము చేయునటువంటి శివశరణలు, వచనశాస్త్ర నిర్మాణము గావించిరనునది గమనార్హమైన సంగతి. ఇట్లు బసవేశ్వరుడు సర్వమానవుల హితమునేకాక స్త్రీ పురుష సమానతను గమనించుట వారి గొప్పతనమునకు నిదర్శనమై యున్నది.

# బసవని యుగమం దుచ్చనీచములు లేవు

బసవేశ్వరుని తత్వము శివాగమములచేత స్ఫూర్తినొందినది. పుట్టుకచేతనే ఒక మనుష్యుడు నికృష్టడనియు శ్రేష్ఠుడనియు వారొప్పుకొనలేదు. దేహము పంచభూతాత్మకమునై యున్నది. ఆత్మ, పుం-స్త్రీ-నపుంసక రహితమైయున్నది. అందుగురించి మానవులందు జన్మతః తరతమ భావనలు లేవనువారి వాదమునకు

" సప్తధాతు సమంపిండం సమయోని సముద్భవం ।
ఆత్మజీవ సముత్పన్న వర్ణానాం కింప్రయోజనం ॥

ఇత్యాది శివాగమ వాక్యములే ఆధారములు. విచారదృష్టిచేతకూడ ఈ వాదము నిలుచునదే యైనది. ఇప్పటి యీ యుగధర్మము మఱియు భారత రాజనీతియు నీ యభిప్రాయమునకే యనుగుణమై యున్నది.

అయినను బసవేశ్వరుడు నీ యుదారమగు నభిప్రాయమును 800 సంవత్సరములకు పూర్వమే లోకమునకు బోధించినాడను నది యందరును మెచ్చుకొను సంగతి. బసవేశ్వరుని యనుభవ మంటపమందు ప్రభుదేవుడు, చెన్నబసవన్న యంతటి మహానుభావుల జతయందు హరళయ్య, కక్కయ్య, శ్వపచయ్యయను పంచమ కుల సంభూతులు శివశరణులై పరిశోభించిరి. అంతేగాక, బసవేశ్వరుడు మధువయ్య కూతురును హరళయ్య కుమారునికిచ్చి లగ్నము చేయించిన కారణమున రాజవిరోధమునకు పాత్రుడై తన యధికారమును త్యాగమొనరించి తత్త్వ సాధనకై శపథముబూని కప్పడి సంగమ క్షేత్రమునకు మరల తిరిగి పోయెను. ఈ సంఘటనము వారి జీవన మందత్యంత ప్రాముఖ్యము వహించునదై యున్నది.

భరతఖండ చరిత్రమందు భగవాన్ బుద్ధదేవుడు, శ్రీ రామానుజాచార్యుడు, శ్రీ బసవేశ్వరుడు మరియు మహాత్మా గాంధి ఈ నలుగురు మహానుభావులను మనము హరిజనోద్ధారకులని ముఖ్యముగా పరిగణింపవచ్చును. అయినను పైన వివరించిన నలుగురియందు బసవేశ్వరుడు అస్పృశ్యతా నివారణ కార్యమందు తన యధికారమును కొనకు తన ప్రాణమును సహితము నిచ్చుట మహాపురుషుని దర్శనమై యున్నది.

## కాయకమే కైలాసము

బసవేశ్వరుడు మానవ సమాజమును, దేశముయొక్క పరిస్థితులను మంచిగా నధ్యయనము చేసియుండెను. జగత్తునందు బ్రతుక దలచినవాడు కార్యతత్పరుడై యుండవలయును. సోమరితనముగల జీవనము దేశమున కనర్థదాయకమని, బసవన్నగా రభిప్రాయపడిరి. అందు గురించియే ప్రతి మనుష్య డుద్యోగ నిరతుడు కావలయును. ఉద్యోగ నిరతులగువారికి లక్ష్మీదేవి ప్రసన్నమగు చున్నది. 'ఉద్యోగినం పురుష సింహ ఉపయతి లక్ష్మీః' 'కాయకమే కైలాసము' (Duty is God) గురువైనను, జంగముడైనను, భక్తుడైనను కాయకమందు నిరతుడు కావలయును, "అర్థాబహిచర ప్రాణాః" అనగా ధనము బహిఃప్రాణమని అర్థశాస్త్రమందు చెప్పినమాట నిజము. చతుర్విధ పురుషార్థములందు ద్రవ్యమునకు ద్వితీయ స్థానమున్నది. ఈ ద్రవ్యము పనిచేయకున్న ప్రాప్తించునదికాదు. సమాజ ప్రగతికి, దేశాభ్యుదయమునకు సంపదావశ్యకము. ఈ సంపదాభివృద్ధియే కాయకము, అథవా ఉద్యోగము. అందుగురించి యిట్టి కాయకమునకు జనులు ప్రాలుమారి యుండరాదు. కాయక నిరతునికి నాత్మావలంబనము మరియు పౌరుషములు అధికముగా

యుండును. సోమరి తననుతానే నాశన మొనరించుకొనును. అనునది బసవేశ్వరుని ఉపదేశము. ఈ మాట లిప్పటి స్వతంత్ర భారతమునకు కూడ యెంత యనుకూల మగునది మనము వివేకముచేత పరిశీలింప వచ్చును.

## దయలేని ధర్మమేది?

బసవేశ్వరు డుజ్వలమైన యహింసావాది. జగత్తునందును ప్రతి పదార్థము నందును. ప్రాణుల యందును వారు శివతత్త్వమును చూచు చుండిరి. వారు సిద్ధి పురుషులగుటవలన నది వారికి సాధ్యమై యుండె డిది. యజ్ఞయాగముల పేరుతో కూడ ప్రాణిహింస నడవకూడదని వారివాదము.

"వేదము జదివిన వారిఎదుట దుఃఖింతువా!
ఓమేకా, శాస్త్రమును జదువువారి ఎదుట
దుఃఖింతువా! ఓమేకా, నీవేడ్చినందులకు దగురీతి
చేయును మాకూడల సంగమ దేవుడు."

(బ. వ. 80)

"దయలేని ధర్మమదేదయ్యా? దయయే కావలయును
సకలప్రాణులలో నెల్ల, దయయే ధర్మమునకు మూలమయ్యా!"

(బ. వ. 54)

ఇత్యాది బసవని వచనములు వారి యహింసా ధర్మనిష్టతను విశ్వమానవ ప్రేమను బోధించుట లేదా!

విద్యా వినయ సంపన్నె, బ్రాహ్మణే గవి హస్తిని।
శునిచైవశ్వ పాకేచ పండితాః సమదర్శినః॥

అను భగద్గీత శ్లోకార్థమును బసవేశ్వరుడు జీవనమందు అను భవమును చేసికొని యుండెను. "దయా ధర్మ కామూల్ హై," 'దయయే ధర్మమునకు మూలమని' మహాత్మ కబీరునిమాట "దయలేని ధర్మ మదేదయ్య ?" అను బసవేశ్వరుని మాట సమానార్థకమునై యున్నది. మహాభారత మందుకూడ "అహింసా పరమో ధర్మః" అని చెప్పబడి యున్న సంగతి ఇట గమనార్హ మైనది.

"చంపునతడె మాదిగ. మలినమును దినునతడె మాల."

(బ. వ. 82)

పైన చూపబడినట్లు బసవేశ్వరుడు ప్రచారము చేసిన అహింసా ధర్మము లక్షల కొలది, కోట్లకొలది జనులయందిప్పటికిని కూడ అను ష్ఠానమందున్నది. బసవేశ్వరుని భక్తమండలి మాంసాహార, మద్య పానములను తిరస్కరించి యున్నది. సదాచార సన్మార్గముల నవలం బించి యున్నది.

"నటికెడు ధర్మమును, తీసుకొని పోయి పొయ్యిలో బడవేయుము"

సర్వజ్ఞముని.

బసవేశ్వరుడు పుట్టిన దేశమందు, అవతరించిన సమాజమందు, ధర్మస్వరూపియగు గోవునకు సోమవారదినము విశ్రాంతి దిన మని రూఢియందు యున్నది. (నాగలికి, బండికి ఎద్దులను కట్టక యుండుట. ఆవులపాలను ఆ దినమున దూడలకు సంపూర్ణముగా విడచి పెట్టుట) ఇచ్చట గమనార్హమైన సంగతియై యున్నది.

## దేవుడు ఒక్కడే – ఇద్దరనునది అబద్ధము

బసవేశ్వరుడు లౌకిక విచారములందెటువంటి జాణయై యున్నాడో పారమార్థిక విషయము లందును, అంతే ప్రవీణుడై యున్నాడు. అని

వారివచనముల వలన మనము తెలుసుకొన గలము. దేవుని విచారము నందు మన దేశమందనేక విధములగు పరిశోధనలు చాల వెనుకటి కాలమునుంచి నడచుచున్నవి. నాస్తికులు, సాంఖ్యులు, జైనులు. బౌద్ధులు, దేవుడను నొక మూలవ్యక్తిలేడని వాదించి యున్నారు. ఉపనిషత్కారులు, మీమాంసకులు మరియు యోగశాస్త్రకారులు, తార్కికులు. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శక్తివిశిష్టా ద్వైత. సిద్ధాంతకారులు, శైవ వైష్ణవ, భాగవత పంథలవారును, దేవుని యొప్పుకొని యున్నారు. క్రైస్తవులు, ముసల్మానులు కూడా దేవునియొప్పుకొనియే యున్నారు.

ఉపనిషత్తులందు "ఏకంసత్ విప్రా బహూదావదంతి" అనగా "దేవుడొక్కడు, — పండితు లనేకముగా చెప్పియున్నారు." అని యున్నది. బసవేశ్వరుడు మరియు వారి సమకాలపు శరణులు దేవుని విచారమును గురించి మంచిగా చర్చించి యున్నారు. వారి తీర్మానము వలె దేవుడు ఒక్కడే యున్నాడు. అతడే జగత్తునందు సృష్టి, స్థితి, లయములకు కారణము. అతడు సాకారుడు కూడ. మరియు నిరాకారుడును కూడ. అతనికి యనంతములగు నామములు కలవను నది వారి యనుభవము.

బసవేశ్వరుడు తన వచనములందు "దేవుడొక్కడు నామము లనేకములు," (బ. వ. 85) "ఇద్దరు ముగ్గురు దేవతలని ఉబ్బిచ్చి మాటలాడుకుము. ఒక్కడే చూడుసుమీ! ఇద్దరననది అబద్ధము. కూడల సంగమ దేవుడుకాక వేరేదేవుడు లేడనెను వేదము," (బ.వ.77) అని దేవుని విషయమై యెంతయో చెప్పియున్నారు. దేవుడున్నాడను భావము జనులందు పాపభీతిని హెచ్చించును. దేవుడొక్కడే యను వాదము జనులందు పరస్పర ప్రీతిని గలుగ చేయును; అను తత్త్వమును బసవేశ్వరుడు బాగుగా నెఱింగెను. ఈ దృష్టిచేతను బసవేశ్వరుని తత్త్వములు విశ్వ ధర్మమునకు అనుగుణములై యున్నవి.

## శరణులు దేశభాషోద్ధారకులు

బసవేశ్వరుని సంచలనము కన్నడ, తెలుగు, మరియు తమిళము మొదలగు దేశభాషల యున్నతికి నెలవై యుండెను. బసవేశ్వరుడు మరియు అతని సమకాలీనులగు శరణులు జనసామాన్య హితమును దృష్టియందుంచుకొని సుందరమగు కన్నడ భాషయందు మనోహర మగు వచనములను గాన మొనరించిరి. ఈ వచనములు జనసామాన్యుల నాకర్షించుటయేకాక కన్నడ యుపనిషత్తులు, కన్నడ శివాగమములను గౌరవమునకు కూడ అర్హములై యున్నవి. వీటి ఫలితముగా నూర్లకొలది శరణులు, కవులు కన్నడమందు గ్రంథములను రచించి యున్నారు. దీనినుంచి కన్నడ సాహిత్యము కూడ పెంపొందెను. దీని ఫలితముగా తెలుగు, తమిళము, మరాఠి మొదలగు సోదర భాషలపైనను ప్రభావము జెందెనని, ఆ యా భాషల చరిత్రలే నిదర్శనములు. బసవేశ్వరుడు విశ్వమానవ హితమునే తనగురియం దుంచుట వలననే వారు దేశభాష లందు గ్రంథములను వ్రాసిరి. మరియు ప్రోత్సహించిరని చెప్పవలసి వచ్చినది. దీనినిబట్టియే దేషభాషలగు కన్నడ, తెలుగు, తమిళములకు ప్రోత్సాహము నొందినది. నూరారు గ్రంథములు నిర్మాణములై యున్నవి.

## జగత్తు అశాశ్వతముగాదు-సంసారము మిథ్యగాదు

మహానుబావుడగు బసవన్నగారు దేశమునకు మరియొక మహత్తర మైన నుపకారమును జేసియున్నాడు. అదేమనగా జగత్తు అశాశ్వతము, మాయ; సంసారము దుఃఖము; స్త్రీ రాక్షసి; దేహమపవిత్రమని చెప్పు వేదాంతుల మాటలచేత సమాజమందు నిరాశయు, సంసారమునందు హేయమును, స్త్రీజాతిపైన ద్వేషమును, తన శరీరముపైని తిరస్కార ముదయించి, సమాజము అధోగతికి పోవుచుండుట గమనించి కరుణాళు

వగు బసవేశ్వరుడు కన్నుతెరచి చూచి జనులకు నిజమగు నుపదేశము చేసియున్నాడు. జగత్తు అశాశ్వితము గాదు, అది సత్యరూపుడైన బ్రహ్మయొక్క కార్యము. అందుగురించి జగత్తు సత్యము. కారణ గుణము కార్యమందు చూడబడును. పితాపుత్ర న్యాయమువలె సహజ మైనది. అయితె జగత్తు పరివర్తనాత్మకము; నీరునందు కరిగిన చక్కెర పైకి కనబడకున్నను విజ్ఞానుని దృష్టియందదెటుల రూపాంతరమై నీరునందు కరిగినదో, యటులనే పరివర్తనమగు జగత్తు సత్యమనుపించును. పరబ్రహ్మయణురేణు తృణకాష్ఠ పరిపూర్ణుడు అను వేదవాక్యము దీనికి సాక్షి. సత్యరూపుడగు బ్రహ్మచేత కూడిన జగత్తు మిథ్యయగునది యెట్లు? అందుగురించియే జగత్తు సత్యమనునది నిశ్చయము. సంసారను మిథ్యకాదు. "స్త్రీ, బంగారము, మన్ను" ఇవి మాయ కావు. వీటినపేక్షించునది మనస్సునందుండు ఆశనే మాయ. సంసారమును నిష్కామ బుద్ధిచేత చేయువాడు అనగా దాసోహం భావన చేత లోక జీవనమును నడుపించు వాడు సదా సుఖియై యుండును. కృతార్థుడు కూడ అనుపించుకొనబడును. స్త్రీ ఆదిశక్తి, మంత్ర స్వరూపిణి యను నంతటి పవిత్రమును, మాయ, రాక్షసి, యనిపిలుచుట మూర్ఖతనము. సృష్టి కార్యమందు స్త్రీ పురుషులు పరస్పరావలంబకులు వీరొకరికొకరు సహాయులే గాని మారకులు కాజాలరు. సతిపతులొకటగు భక్తి పరశివునికి హితకరమునై యున్నది. వెనుకటి శరణులు సంసారముచేసియే ముక్తులైనారనునది దీనికి నిదర్శనము, సంసారములో ముక్తి సిద్ధము.

"మర్త్యలోకమనునది కర్తయొక్క కర్మశాల యయ్యా!
ఇక్కడ చెల్లువారక్కడను చెల్లుదురయ్యా!
ఇక్కడ చెల్లనివారక్కడను చెల్లరయ్యా, కూడలసంగమదేవా!"
(బ. వ. 36)

"దేవలోక మర్త్యలోక మనునని వేరేలేవు తెలియుడు ! సత్యము నుడువునదే దేవలోకము. అసత్య మాడునదే మర్త్య లోకము. ఆచారమే స్వర్గము. అనాచారమే నరకము. కూడల సంగమదేవా మీరే ప్రమాణము."

(బ. వ. 50)

సంసారమనునది శివుని లీలా విలాసము. శివార్పణ బుద్ధిచేత గురులింగ జంగమసేవ చేకొనినవాడు, కాయకమందు నిరతుడై యుండువాడు, లోకజీవనముచేత కృతార్థు లగుదురు, "దేహమే దేవాలయమ"ని తెలసినవాడు సదేహ కైవల్యమును బొందును.

పైననుడివిన హితోక్తు లెంతటి యమూల్యము లైనవి. అంతే గాదు. విశ్వహిత సాధనకు కారణములై యున్నవి.

## చరిత్ర మఱియు ప్రభావము

భక్తియుగ బసవేశ్వరుడు జన్మించినది కన్నడదేశమందు బీజాపుర జిల్లా ఇంగులేశ్వర బాగెవాడియందు. అక్కడతని స్మారకమగు దేవాలయమున్నది. అక్క నాగమ్మ గుహయున్నది. తల్లిదండ్రులు మాదరస, మాదలాంబిక. వీరు జన్మతః శైవ బ్రాహ్మణులు. బసవేశ్వరుని విద్యాభ్యాసము జరిగినది కృష్ణా మరియు మలప్రభానదుల సంగమమందుండు కూడల సంగమ క్షేత్రమునందు గురువు జాతవేద స్వామి, కప్పడి సంగమునందు జాతవేద స్వాములవారి మఠ మిప్పటికినిగూడ యున్నది. బసవేశ్వరుని గురువు సకలశాస్త్ర పండితుడు, శివయోగ సిద్ధుడు. కాలజ్ఞానియునై యుండెను.

బసవేశ్వరుని బాల్యమందే తల్లితండ్రులు చనిపోయిరి. ఇతనికి నాగమ్మయను నొక యక్కయుండెను. ముందీమెయే, చన్న బసవేశ్వ

రుని జననియై అక్క నాగమ్మయని పేరుబొందెను. ఈమె పతికూడల సంగమ నివాసియగు శివస్వామి. బసవని చిన్న వయస్సునందే తల్లి తండ్రులు మృతినొందిన తరువాత ముత్తబ్బెళను అవ్వ నితనిని పోషించినదని, బసవరాజ దేవరరగళయందు చెప్పబడినది. సుమారు 16 సంవత్సరములు మట్టుకు బాగెవాడి యందును, అటు తరువాత 10 సంవత్సరములవరకు కప్పడి సంగమమందు బసవేశ్వరుడు నివాసముచేసి యుండవచ్చును. అక్క నాగమ్మ బసవేశ్వరునితోడనే యుండెనని చరిత్రలవలన తెలియవచ్చుచున్నది. కల్యాణ మంత్రియగు బలదేవుని కూతురు గంగాంబికను, సిద్ధన్నమంత్రి కూతురు నీలాంబికను బసవేశ్వరుడు వివాహమాడెను. సుమారు 10 వర్షములు కల్యాణమందుండెను. మొదలు రాజగృహమందు కరణముగా, కోశాధికారిగా కడకు ముఖ్యమంత్రియై కల్యాణమందు పరిశోభించెను. అంట అనుభవ మంటపమును స్థాపించెను. ప్రభుదేవుడు, చెన్న బసవేశ్వరుడు, సిద్ధరామేశ్వరుడు, రుద్రమునిస్వామి మొదలగు మహాత్ముల మూలకముగ ధర్మప్రచారమును చేయుచుండెను. త్రివిధ దాసోహమును నడుపించుచుండిరి. చివరకుహరళయ్య—మధువయ్య బంధుత్వ ఫలితముగా బిజ్జళ రాజునకు బసవన్నకు భిన్నాభిప్రాయము కలిగెను. అప్పుడు బసవడధికారమును త్యజించి కప్పడికిపోయి అచ్చటనే లింగైక్యమయ్యెను.

## బసవేశ్వరుని సాహిత్యము

బసవేశ్వరుడు కేవలము మహాపురుషుడేకాక కవిశ్రేష్ఠుడుగూడనై యుండెను. బసవడు కన్నడమందు షట్‌స్థల వచనము, శిఖారత్న వచనము, కాలజ్ఞాన వచనము మరియు మంత్రగోప్యమను నాలుగు గ్రంథములను రచించెను. ఇతనిని గురించి కన్నడమందు హరీశ్వర, సింగిరాజ, భీమకవి, షడక్షరదేవుడు మొదలగువారు గొప్పకావ్యములను వ్రాసి

ధున్నారు. తెలుగునందు పాల్కురికి సోమనాథుడు మరియు పిడుపర్తి బసవకవులు, సంస్కృతమందు కంచిశంకరారాధ్యులు మరియు వ్యాసుడు మొదలగువారు గ్రంధములను లిఖించియున్నారు. తమిళమందు బసప లింగకవి ఈ మహాత్మునిగురించి బసవ పురాణమును వ్రాసియున్నారు.

బసవేశ్వరుని జననము క్రీ. శ. 1132 మరణము క్రీ. శ. 1168 జీవితకాలము 36 వర్షములు. బెళగాం జిల్లా అర్జునవాడయందలి శిలా శాసనమునందు బసవేశ్వరుని వంశస్థుల వివరము చెప్పబడియున్నది. బసవనికి బాలసంగయ్యయను నొక కుమారుడుండెననియు, నాతడు బాల్యమునందే గతించెననియు, దానినిబట్టి తెలియుచున్నది. భారతదేశ మందు బసవేశ్వరుని ధర్మానుయాయులు లక్షలకొలది యున్నారు. వారి తత్వములు విశ్వమందలి మహాపురుషుల తత్వములకన్న మిన్నగా నున్నవి. బసవేశ్వరుని వచనము లిప్పుడు హిందీ, ఇంగ్లీషు, ఉర్దు, తెలుగు, తమిళము, మరాఠి మొదలగు భాషలయందు ననుదింపబడినవి. ఏ దృష్టిచేత జూచినను బసవేశ్వరుడు విశ్వమందు మహాపురుషుడై యుండెను.

అభ్యుదయ నిశ్రేయస్సులు సుందర సమన్వయముచేత జగత్తునే రమణీయ మొనర్చుటకై ప్రయత్నించిన అప్పటి బసవన్నను ఇప్పటి వీరశైవులు స్మరించి వారు చూపిన మార్గమందు నడచి "వీరశైవ ధర్మము, విశ్వధర్మ మనునది, ఇప్పటి మరియు రాబోవు జనులకు శుభ దాయకమగుగాక. (ఆస్థాన విద్వాన్, కీర్తనాచార్య, పండితరత్నం, వేద మూర్తులు శ్రీ బి. శివమూర్తి శాస్త్రిగారు, "శరణసాహిత్య" కన్నడ మాసపత్రిక, (సం: 17, సంచిక: 1—2) యందు ప్రకటించిన వ్యాసము ననుసరించి, ఈ వ్యాసము వ్రాయబడినది. అందుకు వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.)

శివం భూయాత్.

రా. మ. వీరభద్రయ్య

"ఆయుర్వేద భూషణ."

# షట్‌స్థల శాస్త్ర ప్రకారము స్త్రీల హక్కులు



వీరశైవ ధర్మముననున్న అనేక వైశిష్యములలో నది స్త్రీలకు సామాజిక మఱియు ధార్మిక స్వాతంత్ర్యముల నొసగిన దానినీ మనము పరిశీలించినచో, నది యంత్యంత మహత్వ విషయమై యున్నదని గోచరించుచున్నది. అది యీ దృష్టిచేత వ్యాపకత్వమును పొందినంత వేరే మతము పొందియుండక పోవచ్చును. వీరశైవ ధర్మ ప్రకారము స్త్రీ పురుషులందరు సమాన హక్కులు గలవారై యున్నారు. ఈ విధమైన విచారములను వీరశైవ వచనకారులు తమ ఉక్తులలో స్పష్ట పఱచియున్నారు.

బసవేశ్వరుని కాలమున ఈ ప్రకారముగ స్త్రీలకై అత్యంత ఉదార మఱియు ఉచ్ఛభావమును వహించుటచేత అప్పుడనేక స్త్రీలు ధర్మకార్యములందు ప్రోత్సాహము నొంది, వాటిలో లిప్తతను బొందినట్టి ఉదహారణము లెన్నియోగలవు. స్త్రీల హక్కుల విషయమై శరణ శ్రేష్ఠుడైన దేవరదాసమయ్యగారు తమ వచనములలో ఈ విధముగా సెలవొసగియున్నారు.

స్త్రీ అంగమునకు సంబంధించిన కచకుచములు రెండు ఆమె ప్రాణమునకుండునా ? లేవు. బ్రాహ్మణుని దేహమున శిఖాయజ్ఞోపవీతములున్నట్లతని ప్రాణమునకుండునా ? లేవు. ఊరు వెలుపల

నున్న అంత్యజుడు కరమున ఖడ్గమునుదాల్చినట్లు ఆత్మ చేబట్టగలడా? లేదు. పరశివుడు తన యంశమైన ఆత్మకు శరీర సంబంధ మేర్పరచి యుండగ స్త్రీ యనియు, పురుషుడనియు, విప్రుడనియు, మాదిగ యనియు, నూటొక్కటి కులములు, 18 జాతులు కల్పించి పరస్పరముగ కలహించు బంధనమగు ఈ జగత్తుయొక్క అచేతనమైన జీవులు ఎట్లు గుర్తింతురు ? గుర్తించరని యర్థము.

ఈ వచనముయొక్క భావము సుస్పష్టముగ నున్నది. జగత్తులో వాడుకకై గూడ సిద్ధమైన జనులు స్త్రీ పురుషులని భావించి వారిలో చిన్న పెద్ద అను తారతమ్యములను పాటింతురు. దానివలెనే కులము. 18 జాతులను కల్పించి ఇట్టివాడు నీచుడు ఇట్టివాడు యోగ్యుడని బోరాడు చున్నారు. ఐన పై నిదర్శింపబడిన వచనకారుని యుద్దేశమేమన. ఈ విధమైన భేదభావములు మనుష్యుని బహిరంగా కృతికి అథవా శరీర మునకు సంబంధమై యున్నవి. ఇవి క్షణికమైనవి. ఐతే మనుష్యుని ప్రాణముమాత్రము దేవుని యంశమైయుండుచే అది స్థిరమైయుండినది. దీనిలో నేవిధమైన భేదము లగుపడుట లేవు. అది అందరిలో ఒకే స్వరూపమున నివసించియుండును. దాని విశాలత్వముపైననే మనుష్యుని యొక్క యోగ్యతను గనిబెట్టవలయునేగాని, వాని బాహ్యాచరణ, బాహ్య శరీరము వీటినుండి మనము యోగ్యతను గుర్తించలేము. అని పై వచన కారుని యాశయము. ఈ విధమైన విచారములు ఆగమ గ్రంథములలో గూడ చూడనగును.

పారమేశ్వరాగమము ౫ వ పటలమున చెప్పఁబడినది.

యేసంతి జాతిభేదాస్తానేక వచ్చి వయోగినః ।

పశ్యేదఖిల జాతిస్థానేక మాతృ సహోదరాః ॥౪౦॥

నస్త్రీ భేదో నపుంభేదో జాతివర్ణాశ్రమాదికం।
సర్వాతీత మిదంవిద్ధి వీరశైవమతం మమ ॥౪౧॥

ఈ ఉక్తిలో ఆగమకారుడు వీరశైవ ధర్మముయొక్క ఈ విశిష్ట తను చాల మంచిగ వివరించినాడు. వీరశైవుడు ఇతర సమస్త జాతి బాంధవులను తన జననీ ఉదరము నుండి ఉద్భవించిన వారుగనే చూడ వలెను. ఈ విధముగనే వారు స్త్రీ పురుషుల భేదమును పాటించగూడదు. జాతి వర్ణాశ్రమముల నాశ్రయించగూడదు. వీటన్నిటిని వీరశైవ ధర్మము మించియున్నదని ఈ ఆగమము నుడువుచున్నది. ఈ తత్వము ననుస రించియే వీరశైవ వచనకారులనేకులు వచనములను రచించియున్నారు.

ఐతే ఈ విధమైన విచారములు బ్రాహ్మణ పద్ధతి ధర్మ గ్రంథ ములలో నగుపడవు. ఉపనిషత్కాలములో పై నగపడిన విధముగ నున్నట్టి ఉదారమైన విచారములు సమాజమున రూఢిగా నున్నను ముందు అవి స్మృతి కాలమున అకుంచిత స్వరూపమును బొంది స్త్రీలకు తత్పూర్వమున నున్న ఉన్నత స్థానమును గోల్పోబడియుండెను. స్మృతి కారులు స్త్రీ పురుషునికి కేవలము అధీనురాలై మెలగవలసినదే. అవియు ఆమెకు వేదాధ్యయనము జేయునధికారము లేదనియు ఆమె కేవలము శూద్రురాలను విచారముల ప్రచారము జేయదలబెట్టిరి. స్త్రీలయొక్క నిజ ధర్మమనగ కేవలము పతి నాశ్రయించి వాని శుశ్రూషలోనే కాల యాపనంబొనర్చునటయే ఒక విధియై యున్నదను విచారములు సమాజమున వేరూరిపోయినవి. ఈ కారణమున ఈ కాలమునకు హిందు సమాజము పురోగమించు స్థితిని బోకార్చి వెనుకంజ వేయనారంభించెనని చెప్పఁబడును.

కాని వీరశైవ ధర్మమున ఇట్లుగాక అది స్త్రీలకు, పురుషుల వలే సామాజిక, ధార్మిక స్వాతంత్ర్యముల నొసగియున్నది. దీనికి

స్త్రీలకు లింగధారణ యొనర్చుటయే ప్రబలప్రమాణమై యున్నది. స్త్రీ ఈ విధముగ గురువుచేత లింగధారణమును బడసిన పిదప ఆమె షట్‌స్థల శాస్త్రము నభ్యసించి దాని తత్వములనరసి, అనుసరించి తన ధార్మిక వికాసమొనర్చుకొనుట ఆమెయొక్క ముఖ్య కర్తవ్యమై యున్నది. ఈ విస్తృత బుద్ధిని యామె తన ప్రయత్నమువలననే బొంద నగును. ఇందు ఆమె తన భర్తపై అవలంబనముంచుట యనవసరము. అతడు జేయు క్రియ, కర్మముల ఫలమును అతడే యనుభవించును కాని యాతని కర్మ ఫలమున సహధర్మచారిణి పాల్గొనదు. ఆ కారణమున స్త్రీ లింగధారణమును బడసిన పిదప షట్‌స్థలము యొక్క సోపాన ములను స్వశక్తితో నెక్కుచు పురోగమించవలెను. ప్రారంభదశలో నామె భక్త మాహేశ్వర స్థలములను బొంది, తదుపరి ప్రసాది, ప్రాణలింగి స్థలములను స్వాధీన పరచుకొని శరణురాలై ఐక్యస్థితి బొందుటకు బాధ్యతవహించుట కర్హురాలగును. ఆకారణముననస్త్రీ తచ్చు మఱియు పురుషుడు హెచ్చు అనుభావన వీరశైవ ధర్మమున లేదు. శ్రీ బసవేశ్వరుడు తన వచనములో ఈ విధముగా జెప్పియున్నాడు. "భర్త శివలింగదేవుని భక్తుడు. భార్య గైకొనునది మద్యమాంసము. భాండ, భాజనము శుద్ధిలేనివారి భక్తి, కల్లుకుండను బయటకడిగినయట్లగు, కూడలసంగమ దేవ"

ఈ వచనములో బసవేశ్వరుడు పతి తన పత్ని సమేతమై ఏరీతిగా మెదలవలసినదిగా బహుసరసముగ వ్యక్తపఱచుకొని యున్నాడు. భార్యనెల్లప్పుడూ స్వాయత్త పరచుకొని కారణమున ఆమెను శుద్ధధార్మిక వర్తనమునకు దప్ప విడచి తానొక్కడే భక్తులపలె నటించిన యిది కల్లుదెచ్చి ఒక కడవలో నునిచియది శుభ్రముగా నుండవలెనని యెంచి దాని వెలుపల కడిగినట్లగుననినుడివి యున్నారు.

ఆ కారణమున స్త్రీ కేవలము త్యాజ్య వస్తువు అథవాఒకటి భోగ్య వస్తువు అని దెలసి యెట్లు బ్రాహ్మణశాస్త్రములు ఆమెనువర్ణించునో అట్లే వీరశైవ ధర్మ గ్రంథములు ఆమెను వర్ణించక ఆమెకు యవి యత్యంత శ్రేష్ఠ స్థానము నిచ్చియున్నవి.

బసవేశ్వరునివలె ఇంకను అనేక వచనకారులు ఇదే అభిప్రాయ మును సమర్థించియున్నారు. దేవర దాసిమయ్యగారు తన యొక వచనములో

"సతిపతు లేకమైన భక్తిహితమై యొప్పును శివునకు, సతిపతు లేకమపనట్టి భక్తి అమృతమున విషము కలసిన రీతియగు జూడుమా! రామనాథా"

ఈ వచనమున తన భార్యయొక్క సుధారణ విషయము భర్త పైన ఎంతటి మహత్వ పూర్ణమైన బాధ్యత యుండునని వచనకారుడు చాల మంచిగా నిరూపించియున్నాడు. ఎవడిట్లు వర్తించక తన భార్య అధర్మమున నడచుటకవకాశ మొసంగునో వాడు జేయు భక్తియెల్ల వృథా యగునని ఈతని భావము. అతను పునః మరొకచోట నుడువుచున్నాడు.

"ఉభయ దృష్టులతో లక్ష్యమగుపడునటుల దంపతులేక భావమై నిలచిన మహేశ్వర లింగమునకు అర్పితమయ్యెను."

ఇందు వచనకారుడు దంపతులను రెండు కన్నులకు పోల్చి యెట్లు కన్నులలో నొకటి పోయిన చూచుకార్యము పూర్తిగ నెరవేరదో అట్లే తన స్త్రీ అధర్మమున నున్నచో పురుషుడు చేయు ధర్మము చెడునని చెప్పుచున్నాడు.

"భర్త భక్తుడై, భార్య భవురాలైన అనుభవించిన భోజనము ఉభయులకు సమభాగము."

బ్రాహ్మణ ధర్మగ్రంథములయందు పతికిని బతియే దైవమని ప్రతిపాదించి వాని శుశ్రూషనే ఆమెకు కర్తవ్యమని అధిక కఠోరముగా చెప్పబడియున్నది? ఈ తత్వములు వీరశైవ స్త్రీధర్మమునకు సంబంధించినవి కావు. ఈ ధర్మముప్రకారము స్త్రీకి లింగధారణ ముండుటచే ఆమెతన ఇష్టలింగమునందు సతిపతీ భావముతో వర్తించవలెను. ఆమెకు లింగమె నిజమైన భర్త, ఆ లింగమునుండియె ఆమె మోక్షపదమును బడయును. వీరశైవుడు లింగధారియైన పిదప నాతడు తన లింగముతోసహా సతిపతి భావముచే వర్తించవలెనని వీరశైవశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. అనేక వచనకారులు ఈ దృష్టితోనే సతిపతీ భావముతో గూడిన అనేక వచనములను రచించిరి. ఈ తత్వము స్త్రీలకుగూడ అన్వయించును. ఆకారణమున ఆమె తనకు లింగమె పతియని తెలసి అత్యంత భక్తియుక్తురాలై వర్తించుట యామె కర్తవ్యమై యున్నది. ఈ విధముగ నామె యాచరించకపోయిన ఆమెయొక్క షట్స్థలాచరణ కార్యములకు భంగము వాటిల్లును. ఈ విషయమై అల్లమ ప్రభుపుగారు తన వచనమున నిట్లు చెప్పి యున్నాడు.

> "సతి భక్తురాలైన అత్యంజుని భయమదేల? సతిపతియను అంగసుఖమును బోకార్చి లింగమె పతియైన పిదప సతికి బతి యుండునా? పతికి సతి యుండునా? పాలు భుజించి వేలు భుజింతురా గుహేశ్వరా?"

ఈ ప్రకారము స్త్రీ బాహ్యాంగ భోగములనువిడచి లింగభోగియై వర్తించుటయే ఆమెయొక్క కర్తవ్యమైయున్నది. ఇటు వ రించు సతికి లింగమె పతి. ఆమెకు బాహ్యాంగ భోగమున కవసరమైన పతియు నిజమైన పతికాడు. ఆమె ఒకవేళ అట్టి పతినే నిజమైన పతియని భావించి

వ_ర్తించిన, యిది పొలుగుడిచిన పిదప వేలుగుడిచినట్లగును. అని యల్లమ ప్రభువుల వారాజ్ఞాపించి యున్నారు. వీరశైవులలో ఈ విచారము లుండుటచేత స్త్రీపురుషులలో హెచ్చుతగ్గులను భావము లుద్భవిల్లుటలేవు.

ఈ విచారములు షట్స్థలమున నుండుటచే, బ్రాహ్మణ సమాజము మఱియు వీరశైవ సమాజము వీనిలోని వాడుకలోనున్న వానిలో మహదంతరము గలిగియున్నది. వీనిలో కొన్నిటికిని మాత్రము నేనిక్కడ వివరించుచున్నాడను.

బ్రాహ్మణశాస్త్రములలో స్త్రీ వివాహమాడియే తీరవలెను. ఆమె అవివాహితురాలై ఎన్నడు ఉండుటకు దగదు. ఒకవేళ ఉన్నపక్షమున ఆమెకు మోక్ష మెన్నటికిని లభించదని నొక్కి వక్కాణించుటకు సిద్ధాంతము లుత్పన్నములైనవి. ఐతే ఇవి షట్స్థలశాస్త్రమునకు సమ్మతమైనవికావు. ఏలనః- షట్స్థలశాస్త్రప్రకారము స్త్రీ తన స్వంత ఆచరణముచేత మోక్షపదము నధిష్టించును. కావున ఆమెకు వివాహము మాడవలెనన్న నిర్బంధముండదు. ఆమె ఇష్టముపై నాధారపడియున్నది. వీరశైవ స్త్రీ పురుషులు ఎల్లప్పుడు లింగభోగోప భోగులై తమ ధర్మాచారములను నిర్వహించుట ప్రధాన తత్వమై యుండుటచే స్త్రీ వివాహితురాలై యుండవలెననే కోరిక సమాప్తికానిదే ఆమెయొక్క లింగధ్యానమునకు ప్రతిబంధకము కలుగును. అప్పుడామె వివాహితురాలై లింగార్పణభావముతో తన కోరికను నెరవేర్చుకొని లింగధ్యానమున అనురక్తురాలై యుండనగును. ఒకవేళ ఆమె అవివాహితురాలై యుండునట్టి దృఢ మనసామె యందుండిన, ఆమె అవివాహితురాలై యుండవచ్చును. కావున వీరశైవ స్త్రీలు వివాహమాడుట అథవా

వివాహ మాడకపోవుట వారి ఇష్టముపై నాధారపడియున్నది. ఇట్లు ఈ విషయమున బ్రాహ్మణ స్త్రీకిని వీరశైవ స్త్రీకిని మహదంతరమై యున్నది.

ఈ విచారముల మూలమున వీరశైవ స్త్రీలు స్వతంత్రులై యున్నారు. బసవేశ్వరుని కాలమున ఈ విధమైన స్వాతంత్ర్యము స్త్రీకి సంపూర్ణముగా లభించుటచేత అప్పుడనేక స్త్రీలు అవివాహితురాండ్రై యుండి, కేవలము ధర్మకార్యములలో తమ ఆయుష్యమునె అంకితముగా నొనర్చినారని దోచుచున్నది. ఇలాంటి స్త్రీరత్నములలో పేరెన్నికగన్న నారీమతల్లులు మహాదేవియొక్క, బొంతాదేవి మొదలైనవారు అత్యంత ప్రసిద్ధిగాంచినవారు. ఈ యుభయులు చివరివరకు అవివాహితురాండ్రైయ్యేయుండి ధర్మతత్వ వ్యాసాంగముననె తమ కాలాన్ని వెళ్లబుచ్చిరి. అట్లే వరదాన గుడ్డమ్మయుగూడ కొంతకాలము కన్యావస్థలోనె యుండి యామీదట వివాహితురాలై. వీరశైవ ధర్మ ప్రసారకార్యమున తన శౌర్యధైర్యములను ప్రకటింపజేసినది. మహాదేవియక్కగారు ఒక్కచో ఈ విధముగా నుడివినార్లు.

> "కామారిని గెలిచితి బసవా? మీ దయచేత, సోమధరుని బట్టితిని బసవా? మీ కృపచేత పేరునకు స్త్రీనియైననేమి? భావించగ పురుషరూపము అతికామిచన్న మల్లికార్జునకు అభరణములిచ్చి భేదమరయక కూడితిని బసవ మీ కృపచేత,

ఇందులో మహాదేవియక్క తాను స్త్రీయైననేమి? పురుషునికిపలె సామర్థ్యముగలది. తన గురువైన బసవేశ్వరుని దయచేత తాను పరమాత్మని కూడియే తీరేదనని యత్యంత దృఢభావముతో చెప్పియున్నది.

ఇదే విధముగ వీరశైవులలో స్త్రీ అవివాహితురాలై యుండుట కనుకూలముండుటచేత ఆమెయొక్క ఇహలోకమునకు సంబంధించిన పతియు గతించినను ఆమెకు వైధవ్యము ప్రాప్తమైనదని యామెకు

కళంకము దేకూడదు. దీనితో ఆమెకున్నట్టి యధికారములు గాని మహాత్యముగాని తగ్గవు. ఐతే బ్రాహ్మణ గ్రంథములలోని విధవ అమంగళురాలని యామె, సామాజిక ధార్మిక వ్యవహారముల బహిష్కరింపవలెనని విధించబడినది. ఈ విచారము .షట్స్థల శాస్త్రమునకు సమ్మతమైనది కాదు. ఏలన పతి గతించినమాత్రాన వీరశైవ స్త్రీ లింగమును ధరించుటచేత యామెకు వైధవ్యము ప్రాప్తించదు. ఎంతవరకు శివచిహ్నమామెయొక్క దేహమునందుండునో అంతవరకామె అమంగళురాలని నోటితో యుచ్ఛరించుట దగదు. అట్టి పుణ్యాంగనను చెడ్డగ బేర్కొనిన మహాపాపమునకు గురియగుదురు. ఈ విషయమున ఒక వచనకారు డీ విధముగా జెప్పియున్నాడు.

"శివభక్తులు తమ నిజకైలాసమున కలిగిన, వారి యర్ధాంగనను పార్వతికి సమానముగ జూడవలెను."

ఈ వచనమున వీరశైవ వితంతువును సాక్షాత్తు పార్వతికి సమానముగా జూడని పరమపాపిష్ఠుల మదోన్మత్తులనే మనవలెనని నుడివియున్నారు."

షట్స్థల శాస్త్రమున ఈ విచారములుండుటచేత స్త్రీయు ప్రత్యక్ష దేవత "స్త్రీయఃయత్ర పూజ్యంతెరమంతె తత్రదేవతాః" ఇంతేగాక ఒక వచనకారుడు ఆమె ప్రత్యక్షముగ పరమాత్ముని స్వరూపమవియే భావించి యీ క్రింది వచనమును నిరూపించియున్నాడు.

"తానుబుట్టించినస్త్రీ తన తొడపైకెక్కెను. తానుబుట్టించిన స్త్రీ అజుని నాలుక నధిరోహించెను. తానుబుట్టించిన స్త్రీ నారాయణుని యెదనెక్కెను. ఆ కారణమున స్త్రీ స్త్రీకాదు. స్త్రీ రాక్షసి కాదు. స్త్రీ ప్రత్యక్ష కపిలసిద్ధ మల్లికార్జుడు జూడుమా!"

అన్యమతీయులు ఏ కారణములను జూపి స్త్రీ రాక్షసియని చెప్పుటకు సాహసింతురో అవే కారణముల ఈ వచనకారుడు పురస్కరించుకొని స్త్రీ ప్రత్యక్ష పరబ్రహ్మ స్వరూపమని ఈ వచనములో స్పష్టపరచినాడు. దీనిపై వచనకారులు స్త్రీలకు నాడు ఎంతటి యున్నత స్థానము నొసగియుండిరనునది దెలియవచ్చుచున్నది.

బసవేశ్వరుని కాలములో ఈ ప్రకారముగ స్త్రీలకు ధార్మిక, సామాజిక స్వాతంత్ర్యము నొసగుటచే ఆ కాలమున కనేక శివశరణులు యవతరించి వీరశైవ మతమును విస్తృతమొనర్చిరి. మఱియు వారిలో ననేకులు మతగ్రంథములనుకూడారచించిరి. మహాదేవియక్క, నీలాంబిక, అక్క నాగలాంబిక, సత్యక్క, మహాదేవి, లక్కమ్మ, బెజ్జమ్మ, మొదలగువారు సుప్రసిద్ధులు.

స్త్రీ విషయమై నాటికినేటికి కలిగిన మహదంతర భావనను వాచకుల లక్ష్యమునకు దెచ్చుట అత్యవసరమై యున్నది. ప్రస్తుతము మన సమాజమువారు బ్రాహ్మణ ధర్మముయొక్క అ కుచింత విచారములను అనుసరించుటలో దొడగియున్నారు. కావున వీరు స్త్రీలకుండబడిన స్వాభావికాధికారములను తొలగించి, వారి ధార్మిక, సామాజిక గొప్పతనములకు కళంకమును దెచ్చుచున్నారు. దీనికై ఇప్పటి వీరశైవులలో నిజమైన షట్‌స్థలజ్ఞాన లోపమే ముఖ్యకారణమని చెప్పవచ్చును.

పం॥ రాచవీర దేవరు
'కావ్య తీర్థ', 'విశారద', 'జాణ'.